

# చందమామ

## పాఠకులకు విజ్ఞప్తి

చందమామ 'ను నిరంతరం ఆకర్షణీయంగా, ఆసక్తిదాయకంగా రూపొందించడానికి మేము చేస్తున్న కృషి, వున్న పరిమితులలో ధర అందరికీ అందుబాటులో వుండడానికి మేము చేస్తున్న ప్రయత్నమూ పఠితలకు విదితమే. పత్రికా నిర్వహణలో ఎప్పటికప్పుడు ప్రతి ఒక ఖర్చూ అపారంగా పెరిగిపోతున్నా, వివిధ క్లిష్ట సమస్యలను ఎదుర్కోవలసి వచ్చినా, పత్రిక ధర అధికం చెయ్యడం ద్వారా ఆ భారాన్ని పఠితలపై మోపకుండా వుండడానికే ఇంతకాలం మేము ప్రయత్నిస్తూ వచ్చాము.

కానీ, అలా కొనసాగించడానికి వీలుకాని పరిస్థితి ఇప్పుడు ఏర్పడింది. చందమామ' ప్రచురణకు సంబంధించిన అన్ని వస్తువుల ధరలూ పెరిగాయి. ముఖ్యంగా, ముద్రణకు అవసరమైన కాగితం ధర ప్రతి సంవత్సరమూ అధికం అవుతూనే వుంది. దాంతోపాటు కేంద్ర ప్రభుత్వపు ఇటీవలి బడ్జెట్ నిర్ణయానుసారం కాగితం ధరపై కస్టమ్స్ సుంకం కూడా చెల్లించవలసి వస్తున్నది. ఈ కారణాలవల్ల ఇప్పుడున్న ధరకు పత్రికను వెలువరించడం అసాధ్యం కావడంతో జూలై '81 సంచిక నుంచీ, చందమామ' ప్రతి వెల తప్పనిసరిగా 25 పైసలు పెంచవలసి వస్తున్నది. జూలై '81 నుంచీ 'చందమామ' విడి ప్రతి వెల రూ. 1-75 లు. సంవత్సర చందా 21 రూపాయలు!

పాఠక మహాశయులు, ఏజెంట్లు సహృదయంతో మా పరిస్థితిని అర్థం చేసుకుని, ఎప్పటిలాగే మాతో సహకరిస్తారని ఆశిస్తున్నాము. మేమూ పాఠకులకు అధిక సంతృప్తి కలిగే విధంగా పత్రికను తీర్చి దిద్దడానికి కృషి చేయగలమని సవినయంగా మనవి చేస్తున్నాము.

—ప్రచురణకర్తలు

భూమినుంచి ఆకాశందాకా
భవనాన్నొకటి కడదాం
లోపలా బయటా ముందూ వెనకా
కుడీ ఎడమా పైనా కిందా
రంగు రంగుల జెమ్స్‌తో
నాలుగు వైపులా అమరుద్దాం




ఎంతో అందమైనదీ కలయింకా
టక్కున తేయిక జెమ్ మనదింకా

క్యాడ్‌బరీస్
చాక్లెట్లు

క్యాడ్‌బరిస్ జెమ్ తీరే అలాగ తియ్య తియ్యని కలల్లాగ

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

ఈ నెల బేతాళకథ ["ఓడిన గంధర్వుడు"] కు ఆధారం రాంబాబు రచన.

ఒకే వ్యక్తి ప్రజలపై సంపూర్ణాధికారం చలాయించే రాజరికవ్యవస్థలో రాజు ఒక పొరబాటుచేసి దాన్ని సరిదిద్దేందుకు మరెన్ని పొరబాట్లు చేయవలసి వచ్చిందో, "వరదబాధితులు" కథలో చూస్తాం.

## అమరవాణి

జీర్యన్తే జీర్యతః కేశాః, దంతాజీర్యంతి జీర్యతః
జీర్యతః చక్షుషీ శ్రోత్రే, తృష్ణైకా తరుణాయతే.

[మనిషికి వృద్ధాప్యదశలో తలవెంట్రుకలూ, పళ్ళూ ఊడి; కళ్ళు సరిగా కనబడక, చెవులు వినబడకపోయినా, అతడిలోని ఆశ మాత్రం నవయౌవనంలోనే వుంటుంది.]

సంపుటి 68 జూన్ '81 సంచిక 6

విడి ప్రతి : 1–50 : : సంవత్సర చందా : 18-00




CHITRA



# వరదబాధితులు

చంద్రపురాన్నేలే ప్రతాపమహారాజు, ఒక పర్యాయం చెప్పుడు మాటలు విని, ఒక అమాయకుడికి అన్యాయంగా ఉరి శిక్ష విధించాడు. తరవాత అసలు విషయం బయటపడింది. కానీ, అప్పటికే ఆ అమాయకుడు ఉరితీయబడ్డాడు. ఈ సంఘటన మహారాజు హృదయాన్ని కలచి వేసింది. అప్పటినుంచీ ఆయన చెప్పుడు మాటలు వినడం పూర్తిగా మానివేయడమే కాక, ఎవరైనా ఫిర్యాదులు తన దాకా తీసుకువస్తే, కఠినంగా శిక్షించే వాడు. ఎవరూ ఎవరిని గురించీ చెడ్డగా మాట్లాడకూడదన్నది ఆయన శాసనం.

ప్రతాపుడిని మంత్రి ఒకసారి ఇలా హెచ్చరించాడు:''మహాప్రభూ! చెప్పుడు మాటలు వినడం తప్పుకాదు. విని నమ్మడమే తప్పు. తమరు ఫిర్యాదులు వినని పక్షంలో, దేశంలో అవినీతి ప్రబలిపోతుంది.''

''అవినీతికి పాల్పడినవాడు, రాజశాసనాన్ని ధిక్కరించిన వాడికిందే లెక్క! నా కొలువులోని అధికారులందరూ విశ్వాస పాత్రులు. వారిపై నా కెంతో నమ్మకముంది,'' అన్నాడు ప్రతాపుడు.

ఇలా వుండగా దేశంలో ఒక ప్రాంతాన విపరీతంగా వర్షాలు కురిసి, నదులు పొంగి వరదలు వచ్చాయి. నదీతీరంలో వున్న వీరవరం, ధీరవరం, శూరవరం బాగా దెబ్బతిన్నాయి. ఎందరివో ఇళ్ళు కూలిపోయాయి, ఆస్తి బాగా నష్టమైపోయింది.

ప్రతాపుడు స్వయంగా వెళ్ళి, ఆ మూడు గ్రామాలూ చూసి వచ్చాడు. అక్కడ జరిగిన అపారనష్టం, ఆయన మనసును కలవర పెట్టింది. మూడు గ్రామాలకూ ముగ్గురు ప్రత్యేకాధికారులను నియమించి, ఒక్కొక్కరికి లక్ష

వరహాల చొప్పున యిచ్చి, ప్రజలకు సాయపడమని చెప్పాడు. ఆ విధంగా వీరవరానికి వీరసేనుడూ, ధీరవరానికి ధీరసేనుడూ, శూరవరానికి శూరసేనుడూ వెళ్ళారు.

వీరవరం ప్రజలు బొత్తిగా అమాయకులు. వీరసేనుడు అక్కడ తనకై ఒక పెద్ద భవంతి నిర్మించుకుని, స్వల్ప ధరలకు అక్కడ వ్యవసాయ యోగ్యమైన భూములన్నీ కొనేసి, తన వాళ్ళందర్నీ అక్కడ చేర్చాడు. ఈ విధంగా ఊరి వాళ్ళందరూ కూలిజనం అయిపోయారు. రాజు చేసిన సాయం గురించి మాట మాత్రంగానైనా ప్రజలకు చెప్పలేదు.

ధీరవరంలో అప్పటివరకూ ప్రజలను పీడించి బతుకుతున్న ఒక దుష్టబుద్ధితో చేతులు కలిపాడు ధీరసేనుడు. ఇద్దరూ కలిసి ఆ ఊరును చెరిసగం పంచుకుని రాజు యిచ్చిన ధనంతో విలాసభోగాలు అనుభవించసాగారు. ఇక్కడి ప్రజలకు కూడా రాజుగారి సహాయం గురించి తెలియదు.

శూరవరాన్ని కుబుద్ధి, దుర్బుద్ధి అనే యిద్దరు దుర్మార్గులు పీడిస్తూండే వాళ్ళు. శూరసేనుడు వాళ్ళతో కలిసి, ఊరును మూడు భాగాలుచేసి పంచుకుని, హాయిగా కాలం గడపసాగాడు. పాపం, అక్కడి



ప్రజలకుకూడా రాజుగారు చేసిన సాయం గురించి ఏమీ తెలియదు.

ఈ మూడు గ్రామాల గురించీ మంత్రి ఎప్పటికప్పుడు సమాచారం సేకరిస్తూనే వున్నాడు. ఆయనకు వచ్చే వార్తలు ఎంతో కలవరపరిచేవిగా వున్నవి.

కొన్ని నెలలు గడిచిపోయాక మంత్రి, ప్రతాపుడితో, "ప్రభూ! తమరు మూడు గ్రామాలకు, మూడు లక్షల వరహాలు సహాయం చేశారు. ఆ సొమ్ము ఎలా వినియోగపడిందో తెలుసుకోవడం మంచిది గదా," అన్నాడు.

"మంచిదే. ఎవరినైనా పంపి తెలుసుకుని రమ్మనండి. అయితే, అధికారులపై

నేరారోపణ చేయడానికి ప్రయత్నిస్తే మాత్రం, శిక్ష కఠినంగా వుంటుంది,'' అన్నాడు ప్రతాపుడు.

మంత్రి పంపిన చమత్కారుడనే వాడు వెళ్ళి, అక్కడి పరిస్థితులు చూసి వచ్చి, మంత్రికి చెప్పాడు. మంత్రి ఆ వివరాలన్నీ విని, ''పరిస్థితి మరీ యింత దారుణంగా వున్నదనుకోలేదు. ఫిర్యాదులు లేవని అధికారులు మరీ విర్రవీగి పోతున్నారు. ఇలా అయితే, దేశంలో సంక్షోభం పుట్టడానికి మరెంతో కాలం పట్టదు. ఈ వివరాలన్నీ రాజుకు ఎలా చెప్పాలో తెలియడంలేదు,'' అన్నాడు.

చమత్కారుడు తాను రాజుతో అసలు విషయం తెలివిగా చెబుతానన్నాడు.

''నీ యిష్టం. రాజుకు కోపం వస్తే నీకు కఠినశిక్ష తప్పదు, జాగ్రత్త!'' అన్నాడు మంత్రి హెచ్చరికగా.

''దేశక్షేమం కోసం, ఆ మాత్రం ప్రమాదంలో తలదూర్చక తప్పదు,'' అని చమత్కారుడు రాజును కలుసుకున్నాడు.

''ఆ మూడు గ్రామాలు ఎలా వున్నాయి ?'' అని రాజు అడిగాడు.

''తమ దయవల్ల అంతా బాగానే జరిగింది, ప్రభూ! కాని, ప్రభువులు కోపగించుకోనంటే, ఒక చిన్న విషయం మనవి చేసుకోవాలి,'' అన్నాడు చమత్కారుడు.

''ఎవరి మీదనైనా నేరారోపణ చేశావో, శిక్ష చాలా కఠినంగా వుంటుంది,'' అన్నాడు ప్రతాపుడు.



''నేరం కాదు గానీ, నా కొక చిన్న లోపం కనబడింది, ప్రభూ! అది, మీ వల్లనే జరిగిందని పిస్తున్నది,'' అన్నాడు చమత్కారుడు ధైర్యంగా.

''నా లోని లోపాలు సరిదిద్దుకోవడానికి నేనెప్పుడూ సిద్ధమే. ఏమిటో చెప్పు?'' అన్నాడు ప్రతాపుడు గర్వంగా.

''వీరవరంతో పోలిస్తే, ధీరవరానికీ; ఈ రెంటితో పోలిస్తే శూరవరానికీ చాలా అన్యాయం జరిగినట్టు, నా మందబుద్ధికి తోస్తున్నది,'' అన్నాడు చమత్కారుడు.

''చెప్పేదేదో సూటిగా చెప్పు,'' అన్నాడు ప్రతాపుడు చిరాగ్గా.

''వీరవరంలో ఒక్కడే వరదబాధితుడున్నాడు. ఆ గ్రామానికి లక్ష వరహాలందించారు. మీ ఔదార్యాన్ని ప్రజలెంతగానో శ్లాఘిస్తున్నారు. ధీరవరంలో యిద్దరు వరదబాధితులున్నారు. ఆ గ్రామానికి రెండు లక్షల వరహాలు యివ్వవలసింది. కానీ, ఒక లక్ష మాత్రమే యిచ్చారు. శూరవరంలో ముగ్గురు వరదబాధితులున్నారు. అయినా ఆ గ్రామానికీ లక్ష వరహాలే యిచ్చారు. ఒక్కొక్క వరదబాధితుడికి వంద వరహాలిచ్చినా, అదే ఎంతో గొప్ప విశేషం. అలాంటిది మీరు, ఒక్కో వరదబాధితుడికి ముప్ఫైవేల పైన యివ్వడం తక్కువ విశేషం కాదు. కానీ అందరికీ సమంగా యిచ్చివుంటే, యింకా బావుండేదని నా అభిప్రాయం,'' అన్నాడు చమత్కారుడు.



"మూర్ఖుడా! ఆ గ్రామాల్లో వందల కొద్ది వరదబాధితులుండడం, నేను స్వయంగా చూశాను. నువ్వు, మూడు గ్రామాలకూ కలిపి అరుగుర్ని లెక్క తేల్చావు! నీకు మతి స్థిరంగానే వున్నదా?" అని అడిగాడు ప్రతాపుడు.

"ప్రభూ! తమరు ఒక మహాత్ముడిని సన్మానించడం కోసం, ఒక మాల తయారు చేయించారు. ఆ మాల తమ చేత్తో ఎవరి నలంకరిస్తే, వారేకదా ఆ మహాత్ముడని మేము గ్రహిస్తాము," అన్నాడు చమత్కారుడు.

"అవును!" అన్నాడు ప్రతాపుడు.

"తమరు వరదబాధితులకని కొంత యిచ్చారు. ఆ డబ్బు ఎవరికిచేరితే, వారినే గదా వరదబాధితులుగా నేను గుర్తించ గలను," అన్నాడు చమత్కారుడు.

"అంటే?" అన్నాడు ప్రతాపుడు.

"ప్రభూ! తమరు ఫిర్యాదులు వినరు. తమ అధికారులు విశ్వాసపాత్రులు. నేను మూడు గ్రామాలకూ వెళ్ళాను. తమరు వరదబాధితులకని ఇచ్చిన సొమ్ము వీర వరంలో ఒక్కడికీ, ధీరవరంలో యిద్దరికీ, శూరవరంలో ముగ్గురికీ చేరింది. దీన్ని బట్టి, వాళ్ళు మాత్రమే వరదబాధితులని నేను భావించాను," అన్నాడు చమత్కారుడు వినయంగా.

దీని వెనక ఏదో రహస్యం వుందని ప్రతాపుడికి అనుమానం కలిగింది. ఆయన ఎవరికీ తెలియకుండా ఆ మూడు గ్రామాలకూ వెళ్ళి, అధికారులు చేసిన అన్యాయాలు తెలుసుకుని, ఎంతో నొచ్చుకున్నాడు. ఆ మూడు గ్రామాలకూ సహాయం కోసం భారీ ఎత్తున కొత్త ఏర్పాట్లు చేసి, దుర్మార్గులను కఠినంగా శిక్షించాడు.

ఆ తరవాత ఆయన తిరిగి ఫిర్యాదులు వినడం ఆరంభించాడు.

మంత్రి చమత్కారుణ్ణి ప్రత్యేకంగా సన్మానించాడు. అప్పటి నుంచి ప్రభుత్వ ధనాన్ని అక్రమంగా కాజేసే వారిని, వరద బాధితులనడం పరిపాటి అయింది.






## 14

[సమరసేనుడు, శివదత్తుడి సైనికుల వెంట, అతడున్న పల్లెకు బయలుదేరాడు. అతడు పల్లెను సమీపించేసరికి, వ్యాఘ్రదత్తుడి భటులు పల్లెను కాల్చివేయడం కనిపించి ది. అక్కడ శివదత్తుడి అనుచరుడొకడు, వాళ్ళను కలుసుకుని తమనాయకుడు పారిపోయాడని చెప్పాడు. అతడి కోసం బయలుదేరిన సమరసేనుడు కొండలమధ్య చిక్కుకుపోయాడు. తరవాత—]

సమరసేనుడు, ఒక పెద్దరాయి వెనక దాక్కుని, ఏనుగుకేసి చూస్తున్నాడు. అతడి వెంట వున్న సైనికులు, ప్రాణాలర చేత పెట్టుకుని వణికిపోతున్నారు. ఒక పెద్ద ఏనుగులమంద ఆ సారంగం నుంచి వెలువడి, తమను నుగ్గునుగ్గుగా తొక్కివేస్తుందేమో అని వాళ్ళ భయం. వాళ్ళు చాలా చిన్న ప్రదేశాన చిక్కుకుపోయారు. పారిపోవడం సులభంకాదు.

ఈ విధంగా భయకంపితులై వున్న సైనికులకూ, సమరసేనుడికీ, ఒకేసారి యిద్దరు, ముగ్గురు అరిచినట్టు, కీచుమంటూ ఒక ఆర్తనాదం వినిపించింది. ఆ ధ్వని గుహకు అవతలి వైపునుంచి వస్తున్నది. కాని, వాళ్ళు వున్న చోటు నుంచి బయటికి రావడానికి భయపడుతున్నారు. ఇప్పుడేం చేయడమా అని అందరూ సతమతమవుతూండగా, ఏనుగు



అన్నిదిక్కులకూ తలతిప్పి చూసి పెద్దగా ఘీంకరిస్తూ, లోగడ సమరసేనుడూ, సైనికులూ వచ్చిన గుహలోకి జొరబడింది. కొద్దిసేపట్లోనే అది జలపాతంలో నుంచి పోతున్నట్టు నీరు కలియబడుతున్న శబ్దం వినిపించింది.

ముందుగా సమరసేనుడు తను దాక్కున్న చోటు నుంచి బయటికి వచ్చాడు. ఆ వెంటనే సైనికులు కూడా బయిటికి వచ్చారు. గుహకు అవతలినుంచి వస్తున్న ఆర్తనాదం, మధ్యమధ్య వినబడుతూనే వున్నది.

''ఎవరో మహావిపత్తులో చిక్కుకున్నట్టుంది!'' అన్నాడు ఒక సైనికుడు.

''అందుకు సందేహం లేదు. కాని, ఏనుగు అంత హఠాత్తుగా అటునుంచి ఎందుకు పారిపోయి వచ్చి వుంటుంది? ఒకవేళ శత్రువులు మన కోసం పన్నిన వల కాదు గదా? అది నిజంగా ఆర్తనాదమా, లేక...." సమరసేనుడు యిలా అంటూండగానే, గుహ అవతల ఏదో పెద్ద కల్లోలం జరుగుతున్నట్టు అరుపులు వినిపించినై.

సమరసేనుడు యిక ఆలోచిస్తూ కూర్చుని లాభం లేదనుకున్నాడు. గుహకు ఆవలనున్న వాళ్ళు శత్రువులైనా మిత్రులైనా—ఏదో ప్రమాదపరిస్థితిలో వున్నారు!

సమరసేనుడు, సైనికులను హెచ్చరించి ముందు నడిచాడు. సన్నని గుహలో నుంచి కొద్దిదూరం పోయేసరికి, ఒక కోనేటి మడుగు కనిపించింది. ఆ నీటి మడుగులో ఊడలు దిగిన కొన్ని చెట్లూ, బాగా ఎత్తుగా పెరిగిన నీటిజమ్మూ వున్నది.

సమరసేనుడు మరికొద్ది దూరం వెళ్ళేసరికి, ముగ్గురు మనుషులు మోకాటిబంటి నీటిలో స్తంభాలకు బంధింపబడి వుండటం కంటబడింది. సమరసేనుణ్ణి చూడగానే వాళ్ళు మరింత పెద్దగా ఆర్తనాదాలు చేయసాగారు.

అసలు పరిస్థితి సైనికులకు గాని, సమరసేనుడికి గాని అవగాహన కాలేదు.

స్తంభాలకు కట్టబడి వున్న వ్యక్తులకు తక్షణం దాపురించబోతున్న ప్రమాదం ఏమీ వున్నట్టు లేదు. ఆ చుట్టుపక్కల మరొక ప్రాణి లేదు. తమను చూసి కూడా వాళ్ళెందుకు అరుస్తున్నారన్న ఆశ్చర్యం సమరసేనుడికి కలిగింది.

స్తంభానికి కట్టబడివున్న వాళ్ళను చేరాలంటే, సమరసేనుడు నీటిమడుగులో దిగి కొంత దూరం నడవాలి. మడుగు అంత లోతుగా లేదని, అక్కడ పెరిగిన నీటిజమ్మును బట్టి తెలుస్తూనే వున్నది. సమరసేనుడు కత్తీ, అంబుల పొదీ జాగ్రత్తగా సర్దుకుని, నీటిలో దిగాడు. సైనికులు అతణ్ణి అనుసరించి నడుస్తున్నారు. వాళ్ళు మడుగులో కొద్దిదూరం వెళ్ళేసరికి, కర్ణపుటాలు బద్దలయేలా, ముగ్గురు బంధితులూ ఒక్కసారి కేక పెట్టారు. మరుక్షణంలోనే మడుగులోని నీరంతా అల్లకల్లోలం కాసాగింది.

సమరసేనుడు నివ్వెరపోయాడు. ఎదురుగా పెద్ద మొసలి ఒకటి నోరు తెరిచి అతడికేసి రాసాగింది. క్షణంలో అతడు బంధితుల ఆర్తనాదాలకు కారణమేమిటో గ్రహించాడు.

కత్తి ఒరలో పెట్టి సమరసేనుడు బాణం ఎక్కుపెట్టాడు. మొసలి తోకాడిస్తూ, పెద్దగా నోరు తెరిచి కోరలు చూస్తూ వేగంగా ముందుకు వస్తున్నది. దానిని అలా అందుబాటులోకి రానిచ్చి, సమరసేనుడు బాణాన్ని దాని నోటిలోకి గురిగా





కొట్టాడు. మొసలి బాణం దెబ్బకు ఒక క్షణకాలం నీటిలో గిలగిల కొట్టుకుని, తిరిగి ముందుకు రాసాగింది. ఇప్పుడు కోపంతో మెరమెరలాడుతున్న దాని కళ్లు భయంకలిగిస్తున్నవి.

ఈసారి సమరసేనుడు కత్తితో దాని మీదికి లంఘించి, బలంగా దాని వెన్ను మీద రెండు పోట్లు పొడిచాడు. మొసలి చావుదెబ్బలు తిని, నీటిలో తన్నుకో సాగింది. అంతవరకూ భయకంపితులై చూస్తున్న బంధితులకు ప్రాణం తెప్పరిల్లి నట్టయింది.

సమరసేనుడు, వాళ్ళను సమీపించి ముఖాలు చూస్తూనే పొందిన ఆశ్చర్యం అంతా, యింతా కాదు. ఆ ముగ్గురూ, తాను గుహలో వ్యాఘ్రదత్తుడి భటులవల్ల బంధింపబడక పూర్వం తనతో వున్నవాళ్లు. కాని, ఆ నాలుగో సైనికుడేమయినట్టు? సమరసేనుణ్ణి గుర్తుపడుతూనే, ఆ ముగ్గురు సైనికులూ అమితాశ్చర్యం చెందారు. వాళ్ళ ఆనందానికి మేరలేదు. తలవనితలంపుగా ప్రాణరక్షణ జరగటమే గాక, తమ నాయకుణ్ణి కూడా వాళ్ళు కలుసుకోగలిగారు.

"సేనానీ, తిరిగి మరొకసారి మిమ్మల్ని చూడగలమని అనుకోలేదు," అన్నాడు ఒక సైనికుడు.

"ఆ నాలుగో వాడెక్కడ?" అని అడిగాడు సమరసేనుడు.

"అతణ్ణి, మీరు చంపిన మొసలి పొట్టన పెట్టుకున్నది. సమయానికి మీరు రాకపోతే, మేమూ ఆ మొసలికి బలిఅయి పోయేవాళ్ళం," అన్నారు సైనికులు.

"మిమ్మల్నిక్కడ స్తంభాలకు బంధించిన వాళ్ళెవరు?" అని అడిగాడు సమరసేనుడు.

సైనికులు జరిగినదంతా కొద్ది మాటల్లో చెప్పారు. వాళ్ళు, తమ నాయకుణ్ణి వెతుకుతూ, గుహలోని రహస్యద్వారం గుండా, యీ ప్రాంతానికి వచ్చారు. ఇక్కడ వాళ్ళను, వ్యాఘ్రదత్తుడి భటులు

బంధించి, తమ నాయకుడి ఆజ్ఞప్రకారం యీ మడుగులోని మొసలికి ఆహారంగా విడిచివెళ్ళారు.

"వాళ్లు మమ్మల్ని యిక్కడ బంధించి పోయి, ఎంతోకాలం కాలేదు. ఆ చెట్ల వెనక్కుపోయి చూస్తే, వాళ్ళు వెళ్ళిన కాలిబాట కనబడుతుంది," అన్నారు సైనికులు.

అందరూ అక్కడవున్న చెట్ల వెనక్కుపోయి చూశారు. వ్యాఘ్రదత్తుడు, తన భటులతో బారులుతీరి పోతూండటం వాళ్ళకు కనిపించింది. సమరసేనుడు, వ్యాఘ్రదత్తుడి మూకను చూస్తూనే, గట్టిగా పళ్ళు కొరికాడు. కాని, తన దగ్గిర వున్న కొద్దిమంది సైనికులతో చేయగలిగిందేమీ లేదు. అన్నిటికన్న ముందు శివదత్తుడు ఎక్కడ వున్నదీ తెలుసుకోవటం అవసరం అనుకున్నాడు.

సమరసేనుడు యిలా ఆలోచిస్తున్నంతలో సైనికుడొకడు చిన్నగా కేకపెట్టి, చెట్టు కొమ్మలకేసి చేయి చూపాడు. అక్కడ ఒక కొమ్మనుంచి కాగితం ఒకటి వేళ్ళాడుతున్నది. సమరసేనుడు ఆశ్చర్యపోతూ దాన్ని అందుకొని, విప్పి చూశాడు. అందులో యిలా వున్నది:

"ఇది, అతి భయంకరమైన ప్రదేశం. త్వరగా, యీ ప్రాంతాన్ని విడిచిపొండి."



ఇది శివదత్తుడి హెచ్చరికేనని, సమరసేనుడు గ్రహించాడు. ఆ ఉత్తరం చాలా హడావిడిగా రాయబడినట్టు, కుదురుగా లేని అక్షరాలను బట్టి తెలుస్తున్నది. వెంటనే అక్కడి నుంచి కదలటం క్షేమమని నిర్ణయించుకున్నాడు, సమరసేనుడు.

అతడు వచ్చిన దారినే వెనక్కు పోదలిచాడు. కాని, ఒక సైనికుడు దాపులనున్న గుహకేసి చేయి చూపుతూ, "చూడండి! ఈ గుహకేసి చాలా మంది మనుషులు నడిచినట్టు, కాలిబాట కనబడుతున్నది," అన్నాడు.

సమరసేనుడు అక్కడ వున్న గడ్డిమొక్కలనూ, చిన్నచిన్న గులకరాళ్ళనూ

పరీక్షించి చూశాడు. సైనికుడి మాటల్లో నిజం వున్నదనిపించింది. ఒకవేళ శివ దత్తుడు యీ మార్గానే ప్రయాణించాడా అన్న అనుమానం అతడికి కలిగింది.

సమరసేనుడు గుహను సమీపించి, లోపలికి తొంగిచూశాడు. అంతా చీకటి మయం. సైనికులలో ఒకడు కాగడా వెలిగించగా, ఆ వెలుగులో ముందుకు నడిచాడు.

కొంచెం దూరం వెళ్ళేసరికి, వాళ్ళకు కనబడిన దృశ్యం భయాన్నీ, ఆశ్చర్యాన్నీ కూడా కలిగించింది. ఒకచోట రాతితో చెక్కబడిన సింహాసనం! దానిచుట్టూ మానవాకారంలో వున్న విగ్రహాలు. వాళ్ళ పోలికలూ, ధరించిన ఆయుధాలూ చూస్తే ఆటవికులలా కనిపించారు.

''ఇది, ఎవరో ఆటవిక నాయకుడి సమాధిస్థలం కావొచ్చు! ఏమయినా, యింత భయంకర ప్రదేశాన్ని, నేనేనాడూ చూడలేదు. ఈ ఆటవికుల భయంకర విగ్రహాలు చూస్తూంటే, నాకు ఏకాక్ష మాంత్రికుణ్ణి చూసినప్పటికంటే, ఎక్కువ భీతి కలుగుతున్నది,'' అన్నాడు సమర సేనుడు.

తమ నాయకుడే యిలా అనేసరికి, యిక సైనికులు పొందిన భీతిభయాలు అంతింత కాదు. వాళ్ళు ఒకరిముఖా



లొకరు చూసుకోసాగారు. మరీ భీతి చెందిన సైనికుడొకడు వెనుదిరిగి పారిపో సాగాడు.

సమరసేనుడు తాను అనాలోచితంగా అన్నమాటలకు చాలా నొచ్చుకున్నాడు. నాయకుడైనవాడు ఎన్నడూ, ఎలాంటి పరిస్థితులలోనూ భయపడుతున్నట్టు బయిటికి తెలియనీయకూడదు.

సమరసేనుడు మిగతా సైనికులకు ధైర్యం చెప్పి, గుహద్వారంకేసి బయలు దేరాడు. ఈ ప్రదేశాన్ని ఎంత త్వరగా వదిలిపోతే, తనకూ తన సైనికులకూ అంత క్షేమం అనిపించిందతడికి. శివ దత్తుడు ఎక్కడవున్నదీ తెలుసుకోవటం

చాలా కష్టసాధ్యంగా కనిపిస్తున్నది. అతడి సంగతి వదిలేసి, తను తిరిగి బయలు దేరిన చోటుకు వెళ్ళిపోదామా అనుకున్నాడు, సమరసేనుడు. కాని అక్కడా పరిస్థితులు తనకేమంత అనుకూలంగా లేవు. ఒకవైపు ఏకాక్షమాంత్రికుడి బెడద, రెండోవైపున ద్రోహి కుంభాండుడు!

ఎన్ని కష్టాలకైనా ఓర్చి, శివదత్తుణ్ణి కలుసుకోవటమే ఉత్తమం అనుకున్నాడు, సమరసేనుడు. దేవీప్రసాదితమైన త్రిశూలం ఎక్కడ వున్నదీ శివదత్తుడికి తెలుసు. ఏకాక్ష, చతుర్నేత్రుల గురువైన శాక్తేయుడిది, ఆ త్రిశూలం. కనక, దాని శక్తికి తిరుగువుండదు!

ఆలోచించిచూడగా శివదత్తుడి ధోరణి కూడా సమరసేనుడికి కొంత అనుమానం కలిగించింది. నిజంగా అతడు తనకు మిత్రుడా, లేక అలా నటిస్తున్నాడా?

నావలోని ధనరాసులూ, దాన్ని కాపాడుతున్న నాగకన్యా – వీళ్ళందరికీ తెలుసునన్నది, నిజం. ఏకాక్షమాంత్రికుడూ, చతుర్నేత్రుడే కాక, వాటికోసం వ్యాఘ్రదత్తుడూ, శివదత్తుడూ కూడా ప్రయత్నిస్తున్నారు. ఈ అందరి కొట్లాటల మధ్యా తాను చిక్కుకుని, కష్టాలపాలవుతున్నాడు....

ఇలా ఆలోచిస్తూ సమరసేనుడు గుహ నుంచి బయిటికి వచ్చాడు. ఎటు పోవటమా అని అతడు ఒక నిర్ణయానికి వచ్చే లోపల, పెద్దకేకలు వినబడటం, ఆ వెంటనే బరిశెలూ, బాణాలూ విసురుగా మీదికి రావటం జరిగింది.

"శత్రువులు! రాళ్ళచాటుకు పరిగెత్తండి!" అని సైనికులను హెచ్చరించి, సమరసేనుడు దాపులనున్న రాళ్ళగుట్టల కేసి పరిగెత్తాడు.

దూరంగా కొండరాళ్ళపై నిలబడి, బాణాలు వదులుతున్న కొందరు సైనికులు, సమరసేనుడికి కనిపించారు. వీళ్ళెవరు? వ్యాఘ్రదత్తుడి సైనికులా, లేక కుంభాండుడి ఆటవికులా?

—(ఇంకావుంది)





# ఓడిన గంధర్వుడు

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నువ్వు ఈ విధంగా శ్రమపడడం చూస్తూంటే, నాకు జాలి కలుగుతున్నది. శరీరబలంలో మనుషులు, దేవతలకు సరితూగరు. కాని, బుద్ధిబలంలో వాళ్ళను మించినవాళ్ళు, మీలో కొందరున్నారు. అలాంటివాడి కథ చెబుతాను, శ్రమ తెలియకుండా విను," అంటూ యిలా చెప్పసాగాడు:

ప్రగల్భుడు అనే గంధర్వుడొకడు భూలోకపు వింతలు చూస్తూ, ఆకాశంలో తిరుగుతూండగా, అతడికి ఒక అరణ్యంలో ఒక మనిషి కనిపించాడు. ఆ మనిషి చిరిగిన గుడ్డలతో బక్కచిక్కి వున్నాడు. ఒక పళ్ళచెట్టు నుంచి రాలిన పళ్ళు

## బేతాళ కథలు



ఏరుకు తింటూ, మధ్యమధ్య ఏ క్రూర మృగం నుంచయినా ప్రమాదం రాగల దేమో అని దిక్కులు చూస్తున్నాడు.

గంధర్వుడు, ఆ గర్భదరిద్రుణ్ణి చూసి జాలిపడకపోగా, వాడికి తన లోకంలో వున్న ఐశ్వర్యాల సంగతి చెప్పి, తనకు గల అపూర్వశక్తులు ప్రదర్శించి వినోదించాలని బుద్ధిపుట్టింది.

వెంటనే గంధర్వుడు ఆకాశం నుంచి ఆ దరిద్రుడి ముందు దిగాడు. దరిద్రుడు కంగారుపడిపోతూ, "అయ్యా, నీ రూపం చూస్తూంటే మనిషివి కాదన్న అనుమానం కలుగుతున్నది. నువ్వెవరివి?" అని అడిగాడు.

గంధర్వుడు తాను గంధర్వలోకం నుంచి వస్తున్నట్టు చెప్పి, ఆ లోకంలో తాను అనుభవిస్తున్న సుఖాలను వివరించి, "నీ పేరేమైతేనేం, నువు గర్భదరిద్రుడివి! నా పేరు ప్రగల్భుడు. అపూర్వ శక్తులు గలవాణ్ణి," అన్నాడు.

దరిద్రుడు ఆ మాటలకు చిన్నగా నవ్వి, "అపూర్వ శక్తులున్నవని చెప్పి ప్రయోజనం ఏమిటి? నే నెప్పుడైనా చూశానా? ఆ శక్తుల ద్వారా నువ్వు చెయ్యగల ఘనకార్యాలేవో చేసి చూపించు," అన్నాడు.

గంధర్వుడు కోపగించుకుని, "అయితే, ఏం చెయ్యమంటావో చెప్పు. నువు చెప్పినది చెయ్యలేకపోతే, ఓడినట్టు అంగీకరించి, నీకు సర్వసంపదలూ యిచ్చిపోతాను. ఒకవేళ నువ్వు ఓడటం జరిగితే, నిన్ను కుక్కగా మారుస్తాను," అన్నాడు.

దరిద్రుడు సరే అని, దాపులనున్న ఒక చెట్టును గంధర్వుడికి చూపుతూ, "నీ అపూర్వశక్తులతో దానిని ఏనుగుగా మార్చగలవా?" అన్నాడు.

గంధర్వుడు వెంటనే ఆ చెట్టు కేసి చేయి ఎత్తి, ఏదో అన్నాడు. మరుక్షణం చెట్టు, ఏనుగుగా మారి ఘీంకరిస్తూ, అక్కడినుంచి పారిపోయింది.

"ఆహాఁ, అద్భుతం!" అంటూ దరిద్రుడు చప్పట్లు కొట్టాడు.

గంధర్వుడు గర్వంగా చూస్తూ, "ఇంకా ఏం చెయ్యమంటావో చెప్పు." అన్నాడు.

దరిద్రుడు, గంధర్వుణ్ణి తన ఇంటికి తీసుకుపోయాడు. అది ఒక చిన్న పూరి గుడిసె. దరిద్రుడు ఆ గుడిసెను అందమైన భవనంగా మార్చమని గంధర్వుణ్ణి అడిగాడు. గంధర్వుడు క్షణంలో దాన్ని మహా భవనంగా చేశాడు.

దరిద్రుడు, తన కుంటి తమ్ముణ్ణి గంధర్వుడికి చూపి, అతడికి కాళ్ళు వచ్చేలా చెయ్యమన్నాడు. గంధర్వుడి శక్తివల్ల, ఆ కుంటివాడి కుంటితనం పోయింది. అది చూసి దరిద్రుడు, తమ్ముడి భుజం ఆప్యాయంగా తడుతూ, పెద్దగా నవ్వాడు.

గంధర్వుడు కోపగించుకుని, "ఇంత వరకూ నువ్వు చెప్పినవన్నీ చేశాను. నీ వాలకం చూస్తూంటే, ఇచ్చకపు మాటలతో నన్ను మోసగించి లాభపడాలని చూస్తున్నట్టు కనిపిస్తున్నావు." అని చిటికెలో భవనాన్ని పూరి గుడిసెగా, తమ్ముణ్ణి అవిటివాడిగా చేశాడు.

దరిద్రుడు బిక్క మొహం వేశాడు. గంధర్వుడు మహదానంద పడిపోతూ, "నా అపూర్వశక్తులతో, నీవు కోరినవన్నీ చేశాను, నువు ఓడినట్టే గదా? ఇప్పుడు నిన్ను కుక్కగా మార్చి, నా లోకానికి పోతాను." అన్నాడు.

ఆ మాటలతో దరిద్రుడు తేరుకుని, "అప్పుడే ఏమయింది! ఈ ఒక్క పనీ



చెయ్యగలిగితే, నువ్వు గెలిచినట్టే," అన్నాడు.

"సరే, ఆ పనేదో త్వరగా చెప్పు," అన్నాడు గంధర్వుడు.

"మరేం లేదు. నీ అపూర్వశక్తులు ఉపయోగించి నేను, నీలాగా; నువ్వు నాలాగా మారిపోయేట్టు చెయ్యి," అన్నాడు దరిద్రుడు.

గంధర్వుడు ఒకటి, రెండు క్షణాలు ఆలోచించి, వణుకుతున్న గొంతుతో, "నేనే ఓడిపోయాను!" అని, దరిద్రుడి పూరి గుడిసెను అందమైన భవనంగా మార్చి, అతడి తమ్ముడి అవిటితనాన్ని పోగొట్టి, అక్కడినుంచి వెళ్ళిపోయాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, నాకు ఒకే ఒక సందేహం. అంతటి అపూర్వశక్తులుగల గంధర్వుడు, దరిద్రుడి ఆఖరి కోరికకు, అలా ఎందుకు వణికిపోతూ, తన ఓటమిని ఒప్పుకున్నాడు? దీనికి సమాధానం తెలిసికూడా చెప్పకపోయావో, నీ తల పగులుతుంది" అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "అంత అపూర్వశక్తులు గల గంధర్వుడు, దరిద్రుడి చేతిలో ఓడిపోవడానికి కారణం, అతడిలో బుద్ధిబలం, తెలివితేటలూ లేక కాదు. తాను గొప్ప తెలివిగలవాడననే అహంకారం, గర్భ దరిద్రుడుగా కనిపిస్తున్న మనిషి, అమాయకుడన్న పొరబాటు అంచనా, అతడి ఓటమికి కారణమైంది. దరిద్రుడి ఆఖరి కోర్కె, గంధర్వుడి అహాన్ని దెబ్బ తీసి, అతణ్ణి ఆలోచించేలా చేసింది. దరిద్రుడి కోర్కె నెరవేర్చడమంటే, తన శక్తులన్నీ అతడి పరం చేయడమవుతుంది. అప్పుడు వాడు, తనను కుక్కగా మార్చగలడు. ఈ సంగతి గ్రహించిన గంధర్వుడు, దరిద్రుడికి అన్ని ఐశ్వర్యాలూ యిచ్చి, మారు పలక్కుండా అక్కడి నుంచి వెళ్ళిపోయాడు," అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతోసహా మాయమై, తిరిగి చెట్టెక్కాడ. —(కల్పితం)



# రక్షణ

రామశర్మ విజయనగరంలో ఒక చిన్న ఉద్యోగం చేస్తూండేవాడు. అతని ఇంట్లో భార్యా, కూతురుతో పాటు అతని తమ్ముడి కూతురి కూడా ఉండేది. తమ్ముడిభార్య చనిపోయాక, పిల్ల అలనా పాలనా చూసే ఆడవాళ్ళు లేనందున, రామశర్మ ఆ పిల్లను తన ఇంటికి తీసుకువచ్చాడు. రామశర్మ భార్య మరిది కూతురుని, తన కూతురితో పాటు ఎలాంటి భేదభావం లేకుండా చూసు కొనేది.

పండగలకు బట్టలదుకాణానికి వెళ్ళినప్పుడు రామశర్మ తన కూతురుకు ఖరీదైన దుస్తులూ, తమ్ముడి కూతురికి చవక దుస్తులూ ఎన్నిక చేసే వాడు. రామశర్మ భార్య అతణ్ణి మందలించి, ఇద్దరికీ ఒకే రకం దుస్తులు కొనేది.

నాలుగు సంవత్సరాలు గడిచాయి. రామశర్మ పండగలకు తమ్ముడి కూతురుకు చవక దుస్తులు కొన్నా, భార్య అభ్యంతరం చెప్పడం మానేసింది. క్రమంగా తన కూతురుకు మంచి భోజనం పెట్టి, మరిది కూతురుకు మిగిలిపోయిన అన్నం, కూరలూ పెట్టసాగింది.

ఒకరోజున రామశర్మ, తమ్ముడి కూతురును పక్క గ్రామంలోవున్న అతడి ఇంటికి తీసుకు పోయి, "మీ వదినె నాలుగైదుమాసాల క్రితంవరకూ, నీ కూతురిని ప్రేమగా చూసుకొనేది. నేను పండగలకు దాని సంగతి తెలుసుకుందామని, నీ కూతురుకు చవకదుస్తులు ఎన్నిక చేస్తే, నాతో పోట్లాడి మంచి దుస్తులు కొనేది. ఇప్పుడు తనే నీ కూతురుకు చవకదుస్తులు ఎన్నిక చేస్తున్నది. మరి కొంతకాలం గడిస్తే, నీ కూతురును రాచిరంపాన పెట్టగలదు కూడా. ఇక ముందు నీ కూతురు రక్షణ భారం, నీదే!" అని చెప్పాడు.

—మల్లాది వెంకటకృష్ణమూర్తి





# అపవాదు

శ్యామాపురం చుట్టుపక్కల కొన్ని గ్రామాలకు కూడలి కావటంవల్ల, కాశీలో వైద్య విద్య అభ్యసించిన శేషాచలం అనే యువకుడు, భార్యతో అక్కడికి వచ్చి, వైద్య వృత్తి ప్రారంభించాడు.

ఒకనాడు కొందరు గ్రామస్థులు చెట్టు మీది నుంచి పడిన బాలుడొకణ్ణి శేషాచలం వద్దకు తీసుకువచ్చారు. వాడికి బాగా దెబ్బలు తగిలినందున, అప్పటికే ఎంతో రక్తస్రావం జరిగిపోయింది. శేషాచలం వాడి ప్రాణాలు కాపాడలేకపోయాడు.

నాలుగురోజుల తరవాత, ఒక వృద్ధుడికి హఠాత్తుగా ధనుర్వాతం కమ్మి పడిపోగా, బంధువులు అతణ్ణి శేషాచలం దగ్గిరకు మోసుకువచ్చారు.

శేషాచలం ఎన్ని మందులువాడీ లాభం లేక, ఆ వృద్ధుడు రెండురోజుల తరవాత చనిపోయాడు.

ఇలాంటిదే మరొక యువకుడి విషయంలో కూడా జరిగింది. శేషాచలం వృత్తి ప్రారంభించిన నెలరోజుల్లోనే, అతడి దగ్గిరకు వైద్యానికి వచ్చిన ముగ్గురు ఈ విధంగా చనిపోవటంతో, గ్రామస్థులు శేషాచలం చేతి మాత్ర వైకుంఠయాత్ర అని, చెప్పుకోసాగారు.

ఇక తన దగ్గిరకు వైద్యం కోసం ఎవరూ రారని తేలాక, శేషాచలం మరొక చోటుకు పోయే ప్రయత్నంలో వుండగా, అతడి పొరుగింట్లో కాపరంవుండే కాంతమ్మ అనే ఆవిడకు హఠాత్తుగా విపరీతమైన కడుపునొప్పి వచ్చింది.

శేషాచలం వైద్యంలో నమ్మకంలేని ఆమె భర్త గురునాథం, గ్రామంలో తానెరిగివున్న ముఖలింగం అనే నాటువైద్యుణ్ణి తీసుకువచ్చాడు. అతడిచ్చిన మాత్రలు పనిచెయ్యలేదు.

ఎస్. వి. ఆర్. సత్యనారాయణమూర్తి

కాంతమ్మ పెద్దగా మూలుగుతూ, '' ఈ బాధ భరించలేను! శేషాచలంగారి నైనా తీసుకురండి. ఏ పుట్టలో, ఏ పాము న్నదో,'' అనసాగింది.

ఆమె బాధ చూసి కంగారుపడిపోతూ బస్తీకైనా పోయి, మంచి వైద్యుణ్ణి తీసు కొద్దామనుకున్నాడు, గురునాథం. కాని, భార్య బాధభరించలేక శేషాచలాన్నయినా తీసుకురమ్మనగానేఅతడు చేసేదిలేక శేషా చలాన్ని తీసుకువచ్చాడు. అతను ఏవో మాత్ర లిచ్చాడు. కొద్దినిముషాల్లోనే కాంతమ్మ కడుపునొప్పి మంత్రించినట్టు మాయమైంది.

గురునాథానికి కలిగిన ఆనందం అంతా యింతా కాదు.

ఆ మర్నాడు కరణం వీరయ్య కొడుకు శీనయ్య ఉన్నట్టుండి పడిపోయి కాళ్ళూ, చేతులూ కొట్టుకోసాగాడు. నాటుమందులు పనిచేయకపోయేసరికి, శీనయ్య బల వంతం మీద కరణం శేషాచలానికి కబురు చేశాడు.

శేషాచలం, శీనయ్యకు ఏవో మాత్రలు యిచ్చి, కాళ్ళకూ, చేతులకూ తైలం మర్దన చేయించాడు. ఒకటి, రెండు గంటలు గడిచేంతలో శీనయ్య కాళ్ళూ, చేతులూ కొట్టుకోవటం తగ్గిపోయింది. మూడోరోజు కల్లా అతడి ఆరోగ్యం పూర్తిగా చక్క బడింది.

కరణం వీరయ్య సంతోషించి, శేషా చలానికి ఒక బస్తా బియ్యం యింటికి



పంపటంతో పాటు కొంత డబ్బు కూడా యిచ్చాడు.

ఈ విధంగా శేషాచలానికి గ్రామంలో పలుకుబడికలవాళ్ళ ప్రాపకం దొరకటమే గాక, వైద్యుడుగా అతడి శక్తిసామర్థ్యాలు పదిమందీ గుర్తించారు.

అతడి దగ్గిరకు క్రమంగా రోగులు రాసాగారు. వాళ్లకు తగిన చికిత్సచేసి, ఆరోగ్యవంతుల్నిచేస్తూ శేషాచలం కొద్దికాలంలోనే ఆ గ్రామంలోనే కాక పొరుగు గ్రామాల్లో కూడా గొప్ప వైద్యుడుగా పేరు సంపాయించాడు.

శేషాచలానికి వైద్యం తెలియదన్న అపవాదు పోగొట్టటానికి, గురునాధం భార్య కాంతమ్మా, కరణం కొడుకు శీనయ్యా ఆడిన నాటకం, వాళ్లకుతప్ప మరెవరికీ తెలియదు.

మొదట్లో చనిపోయిన ముగ్గురూ, పరిస్థితి బాగా విషమించాక శేషాచలం దగ్గిరకు రావటం జరిగింది. ఆ సంగతి గుర్తించని మూఢవిశ్వాసాలు గల గ్రామస్థులు, అతడికి వైద్యం బాగా తెలియదనీ, హస్తవాసి మంచిదికాదనీ అనుకోవడం జరిగింది.

కాంతమ్మ, శీనయ్య పినతల్లి కూతురు. వాళ్ళు చిన్నప్పుడు ఒక బంధువు దగ్గిర గళపట్టు అభ్యాసం చేశారు. గళపట్టు అంటే—నోట్లో వేసుకున్నవి, గొంతులో చాలాసేపు వుంచుకుని, ఆ తరవాత పైకి తీయటం.

ఈ విద్య ప్రయోగించి కాంతమ్మ లేని కడుపునొప్పి నటించి, నాటువైద్యులు తనకు యిచ్చిన మాత్రలు మింగకుండా వూరుకున్నది.

శీనయ్య కిందపడి కాళ్ళూ, చేతులూ కొట్టుకోవటం కూడా అంతే!

ఈ విధంగా మూఢవిశ్వాసాలు లేని శీనయ్య, కాంతమ్మ సాయం కూడా తీసుకుని, తమ గ్రామాన్ని నాటువైద్యుల బారి నుంచి కాపాడటమే గాక, వైద్యశాస్త్రం బాగా తెలిసినవాణ్ణి, తమ గ్రామం వదిలి పోకుండా చేయగలిగాడు.





# గంగులు భక్తి

ఒక పల్లెటూళ్ళో గంగులు అని ఒక గారడీవాడుండేవాడు. వాడు ఏటా కొన్నాళ్ళ పాటు గ్రామగ్రామానికీ వెళ్ళి, రచ్చపట్టు చేరి, గొంతెత్తి చమత్కారమైన మాటలు మాట్లాడేవాడు. వెంటనే గ్రామంలో గల వృద్ధులూ, చిన్నపిల్లలూ, యువకులూ ఉత్సాహంగా వాడి చుట్టూ గుంపుగా మూగేవారు.

గంగులు తన గురువు వద్ద నేర్చిన విద్యలన్నీ, ఒక్కటి కూడా బీరుపోకుండా, ప్రతిచోటా ప్రదర్శించేవాడు. రకరకాల మొగ్గలు వేసి బంతులాడించేవాడు, కత్తులాడించేవాడు. చివరకు ప్రేక్షకు లిచ్చినది పుచ్చుకుని మరొక చోటికి వెళ్ళిపోయేవాడు.

గారడీవిద్యలో గంగులును మించిన వాడు లేడని అందరూ ఒప్పుకునేవారు. కాని వాడి సంపాదన రెండు పూటలా తిండికే చాలేదికాదు. వాడు అతి బీద స్థితిలో ఉండేవాడు.

"ఈ జీవితం ఇలా వెళ్ళితే ఈ ఇహ లోకంలో సుఖపడలేదని విచారించను, చచ్చినాక ఆ లోకంలోనైనా దేవి అనుగ్రహం వల్ల సుఖం దొరికితే అదేచాలు!" అనుకునేవాడు గంగులు.

గంగులు పుట్టి పెరిగిన గ్రామంలో ఒక దేవీ ఆలయం ఉంది. ఆ దేవి చాలా మహిమ గలదని ఆ చుట్టుపక్కల అనేక గ్రామాలవాళ్ళకు నమ్మకం. నవరాత్రులు జరిగితే అనేక గ్రామాలవాళ్ళు ఆ ఆలయానికి వచ్చి ఎంతో వైభవంగా ఉత్సవాలు చేసి, ఎంతో డబ్బు ఖర్చు చేసేవారు.

సంవత్సరం పొడవునా పొట్ట చేతపట్టుకుని ఎన్ని గ్రామాలు తిరిగినా, గంగులు నవరాత్రులకు విధిగా స్వగ్రామం తప్పక చేరుకునేవాడు.

రానురాను గంగులు పెద్దవాడైపోయినాడు. గారడీ చెయ్యటంలో వాడి శక్తి ఏమీ తగ్గకపోయినా, వాడి రాబడి మాత్రం తగ్గింది. ఎందుచేతనంటే, చుట్టుపక్కల అన్ని గ్రామాలవాళ్ళూ గంగులు గారడీని ఏన్నో వందలసార్లు చూసి ఉన్నారు. వారికి అందులో కొత్తదనం పోయింది. అసలే పేదవాడైన గంగులు వయసు మళ్ళిపోతున్నకొద్దీ మరింత పేదవాడు కాసాగాడు.

ఇహసుఖం తగ్గిపోతున్నకొద్దీ గంగులుకు పరలోక సుఖం మీద కోరికా, నమ్మకమూ హెచ్చసాగాయి. వాడు ఊళ్ల వెంట తిరగటం తగ్గించి, ఎక్కువ కాలం దేవీఆలయంలోనే గడుపుతున్నాడు.

ఒకసారి నవరాత్రులు వచ్చాయి. ఊళ్ళో అందరూ నవరాత్రి ఉత్సవాల పనిలోనే నిమగ్నులై ఉన్నట్టు కనపడ్డారు. సమారాధనకు కూరలూ, ధాన్యమూ బళ్ళతో వచ్చిపడుతున్నాయి. గుడిచుట్టూ పందిళ్ళు వేస్తున్నారు. తోరణాలు కడుతున్నారు.

వీరందరినీ చూసి గంగులు తన్మయుడైపోయాడు. ''పుణ్యాత్ములు! ఆ తల్లి వీళ్లందరినీ చల్లని చూపు చూడక ఏం చేస్తుంది? ఇక బ్రాహ్మల పుణ్యం చెప్పనే అక్కర్లేదు. వాళ్లు మంత్రాలు చదువుతారు, పూజలు చేయిస్తారు. అందువల్ల అంతులేని పుణ్యం సంపాదిస్తారు,'' అనుకున్నాడు వాడు.



అంతలోనే వాడికి పెద్ద విచారం పట్టుకుంది: "ఈ ఉత్సవంలో కుండలు చేసేవాళ్ళూ, భజంత్రీలూ, హరిదాసులూ, భజనలు చేసేవాళ్లూ, ఆఖరుకు సంతర్పణ వంటలు చేసేవాళ్ళు కూడా అమ్మవారికి తమ శక్తికొద్దీ సేవచేసి పుణ్యం సంపాదించుకుంటారు. కాని నా వల్ల ఏమీకాదు. నేను ఆ తల్లికి ఏమీ చెయ్యలేను!" అనుకుని గంగులు నిట్టూర్చాడు.

దేవీనవరాత్రులు ఆరంభమయాయి. తొమ్మిది రోజులూ ఆలయం భూలోక వైకుంఠంగా ఉంది. ఇదంతా కళ్ళ చూసిన ఆనందంతోబాటు గంగులుకు తీరని ఆవేదన కూడా పట్టుకుంది. "ఇంత మంది ఇన్ని విధాల దేవికి సేవచేశారు! నేనేం చేశాను?" అని వాడు విచారించసాగాడు. తొమ్మిదో రోజున వాడికొక మంచి ఆలోచన వచ్చింది. దానితో వాడి విచారమంతా పోయింది.

ఆ రాత్రి పూజ అయిపోయాక అందరూ వెళ్ళిపోయారు. ప్రసాదం ఇంకా ఏమైనా దిగబడిపోయిందేమో చూడటానికి పూజారి గుడిలోకి అడుగుపెట్టేసరికి ఒక వింతదృశ్యం కనిపించింది.

కుంకంతో, పూలతో సగం కూరుకుపోయిన దేవివిగ్రహం ముందు గంగులు మొగ్గలు వేసి బంతులూ, కత్తులూ ఆడిస్తున్నాడు!

పూజారి అప్పటికప్పుడే పరిగెత్తి, ధర్మకర్త ఇంటికి పోయి, ధర్మకర్తను లేపి,



"బాబూ, గంగులు చూడండి, గుళ్ళో ఏం చేస్తున్నాడో!" అన్నాడు.

"ఏం చేస్తున్నాడు?" అని ధర్మకర్త ఆదుర్దాగా అడిగాడు.

"ఎంత అపచారం, గుళ్ళో విగ్రహం ఎదట గారడీ చేస్తున్నాడు! వాడికి నిజంగానే మతిపోయింది!" అన్నాడు పూజారి.

"నువు వెళ్ళి శాస్తుల్లుగారినీ, అవధాన్లు గారినీ పిలుచుకురా!" అని పూజారిని పంపేసి, ధర్మకర్త నేరుగా గుడికి వెళ్లాడు.

ఆయన చప్పుడు చేయకుండా గుడి వాకిలి వద్దకు పోయి ఓరగా తెరిచిన తలుపు సందుల్లోనుంచి చూశాడు. ఆయన శరీరం ఒక్కసారి జలదరించింది.

గుడిలోపల గంగులు నిద్రపోతున్న వాడిలాగా పడుకుని ఉన్నాడు, దేవి వాడి తలను తన ఒడిలో పెట్టుకుని, ఒక చేత్తో విసనకర్ర తీసుకుని విసురుతూ, రెండవ చేత తన చీరకొంగు పట్టుకుని గంగులు నుదిటి మీది చెమట తుడుస్తున్నది! విగ్రహం ఉండవలిసిన చోట విగ్రహం లేదు!

వెంటనే ధర్మకర్త వాకిలి దగ్గిర సాష్టాంగపడి పెద్ద గొంతుతో దేవీస్తవం చదవసాగాడు.

ఇంతలో మరికొందరు బ్రాహ్మణులను వెంటపెట్టుకుని పూజారి గుడికి వచ్చాడు. ఆయన ధర్మకర్తను చూసి, "ఏమిటి, బాబూ! ఏమిటిది?" అని అడిగాడు.

ధర్మకర్త లేచాడు. అందరూ గుడిలోకి అడుగుపెట్టారు. విగ్రహం యథాస్థానంలో ఉంది. గంగులు నిశ్చింతగా నిద్రపోతున్నాడు. ధర్మకర్త తాను చూసిన దృశ్యం మిగిలినవాళ్ళకి వర్ణించి చెప్పాడు.

బ్రాహ్మలు నమ్మలేదు. కాని కుంకంలో దేవి పాదం గుర్తు స్పష్టంగా కనబడింది. విగ్రహానికి కట్టిన చీరచెంగు చెమటతో తడిసి ఉన్నది. "మనమంతా దొంగ భక్తులం, ఈ గంగు లొక్కడే దేవికి ముద్దుబిడ్డ!" అన్నాడు ధర్మకర్త.






# మహాసాధ్వి

బ్రహ్మదత్తుడు కాశీరాజ్యాన్ని పరిపాలించే కాలంలో, బోధిసత్వుడు నగరానికి సమీపాన వున్న ఒక గ్రామంలో, ఒక సంపన్న గృహస్థుడి కుమారుడుగా జన్మించాడు.

అతడు చిన్నతనంలోనే సమస్త విద్యలూ నేర్చాడు. యుక్తవయస్సు రాగానే అతని తల్లిదండ్రులు కాశీనగరంలో ఒక పెళ్ళి సంబంధం చూశారు. సుజాత అనే ఒక కన్యను తెచ్చి బోధిసత్వుడికి పెళ్లి చేశారు. సుజాత సౌందర్యవతి మాత్రమే కాక సుగుణవతి, వివేకవతి. అటు భర్తకూ, అత్తమామలకు కూడా పరిచర్యలు చేస్తూ, తలలో నాలుకగా మసలుకునేది.

బోధిసత్వుడు కూడా ఆమె పైన ఎంతో అనురాగం చూపేవాడు. ఇలా ఆ యిద్దరిదీ ఒక్క మాట, ఒక్క మనస్సు అయి, చూడ ముచ్చటగా వుండేవారు.

కొంత కాలం గడిచిన తరవాత ఒక నాడు, సుజాత తన భర్తతో, "నాకు మా అమ్మనూ, నాన్ననూ చూసి రావాలని వున్నది. వాళ్లు వృద్ధులైపోయారు. మీరు తోడు వస్తే, యిద్దరం కలిసి వెళ్లి చూసి వద్దాం," అన్నది.

ఇందుకు బోధిసత్వుడు చాలా సంతోషించి, "అలాగే తప్పకుండా వెళదాం. నాకూ అత్తమామల్ని చూడాలని చాలా కాలంగా కోర్కె వున్నది. ఇంటిదగ్గిర తొందర పనుల కారణంగా వూరుకున్నాను. లేకపోతే నేనే ముందు బయలుదేరదామని చెప్పేవాణ్ణి," అన్నాడు.

మరసటి రోజున ప్రయాణానికి అన్నీ సిద్ధం చేసుకున్నారు. అవసరమైన వస్తువులన్నీ బండిలో సర్దుకుని బయలుదేరారు. సుజాత బండిలో కూర్చున్నది. బోధిసత్వుడు తొట్టెలో కూర్చుని బండి తోలు

తున్నాడు. వాళ్లు, కాశీనగరం పొలిమేరలు చేరాక, ఒక చెట్టు కింద బండి విప్పి, అక్కడ వున్న కొలనులో కాళ్ళూ, చేతులూ కడుక్కుని, వెంట తెచ్చుకున్న ఆహారం భుజించారు. కొంచెం సేపు విశ్రాంతి తరవాత మళ్ళీ బండి పూన్చి, నగరంలోకి బయలుదేరారు.

సరిగా బోధిసత్త్వుడి బండి నగరం ప్రవేశించే సమయాన, కాశీరాజు ఏనుగు అంబారీ ఎక్కి నగరంలో ఊరేగుతున్నాడు. ఆ ఉత్సవం చూడ వేడుక కలిగి, సుజాత భర్త అనుమతితో బండి దిగి, కాలినడకన ముందు నడవసాగింది. బోధిసత్త్వుడు బండిలో వెనకగా వస్తున్నాడు.

అంబారీ పైన వున్న కాశీరాజు, అతి రూప సౌందర్యవతి అయిన సుజాతను చూశాడు. ఆమెను పెళ్ళాడాలన్న బుద్ధి పుట్టింది, రాజుకు. ఆమెను గురించి భోగట్టా చేయగా, ఆమె ఫలానావారి అమ్మాయి అనీ, బండిలో కూర్చున్న వ్యక్తే ఆమె భర్త అనీ తెలియవచ్చింది.

రాజు ఒక దురాలోచన చేశాడు. సుజాత భర్తను ఏదో విధంగా తుదముట్టించి, తరవాత ఆమెను తన రాణిగా చేసుకుందామనుకున్నాడు. ఇందుకు అతడు తిరుగులేని ఒక వ్యూహం పన్నాడు.

తనకు విశ్వాసపాత్రుడైన ఒక భటుణ్ణి పిలిచి, రాజు అతడికి తన కిరీటం యిచ్చి, "ఈ కిరీటాన్ని ఎవరూ చూడకుండా,



ఆ కనపడే బండిలో పడవేసిరా,'' అని చెప్పాడు.

భటుడు, కిరీటాన్ని బండిలోవేసి, ఆ సంగతి రాజుకు చెప్పాడు. ఒక పావు గంట కాలం గడిచేలోపలే, జనంలో, "రాజుగారి కిరీటాన్ని ఎవరో అపహరించారు!'' అన్న గగ్గోలు ప్రారంభమైంది.

రాజు, తన భటులకు కిరీటం దొంగిలించినవాణ్ణి వెతికి పట్టుకోమని అజ్ఞ యిచ్చాడు. ఒక భటుడికి బోధిసత్త్వుడి బండిలో వున్న కిరీటం కనిపించింది. వాడు బోధిసత్త్వుణ్ణి దొంగ అంటూ లాక్కుపోయి రాజు ముందు నిలబెట్టాడు.

రాజు ఉగ్రుడైపోయి, "వీడా, నా కిరీటాన్ని అపహరించినవాడు! ఈ దుర్మార్గుణ్ణి తీసుకుపోయి శిరశ్ఛేదం చెయ్యండి,'' అని ఆజ్ఞాపించాడు.

ఈ విధంగా తన వ్యూహం జయప్రదమైందని రాజు సంతోషిస్తుండగా, భటులు బోధిసత్త్వుణ్ణి కొరడాలతో కొడుతూ, వీధులన్నీ తిప్పి అవమానించారు. తరవాత, తల నరికేందుకు నగరం వెలపలవున్న బలిపీఠం దగ్గిరకు తీసుకుపోయారు.

ఈ సంగతి తెలిసి సుజాత దుఃఖిస్తూ, భర్త వెనకగా బయలుదేరింది. "మీకు, యీ కీడు తెచ్చిపెట్టినది, నేనే!'' అని విలపిస్తూ, ఆమె బలిపీఠం దగ్గిరకు చేరి, ఆవేదనతో, "అమాయకులను రక్షించగల, దేవుడే లేడా ? దుష్టులదుండగాలు, యిలా సాగవలసిందేనా?'' అని ఆక్రోశించ



సాగింది. మహాసాధ్వి అయిన సుజాత యిలా విలపించే సరికల్లా, స్వర్గలోకంలో ఇంద్రుని సింహాసనం వణకసాగింది.

"కారణం ఏమిటి?" అనుకుంటూ ఇంద్రుడు దివ్యదృష్టితో చూశాడు. జరగనున్న ఘోరం ఆయనకు తెలిసింది.

ఇంద్రుడు ఒక విచిత్రపరిస్థితి కల్పించాడు. రాజు స్థానంలో బోధిసత్వుడూ; బోధిసత్వుడు వున్నచోట రాజూ వుండేటట్టు, తన మహిమవల్ల యిద్దరి స్థానాలూ మార్చివేశాడు.

ఏనుగు అంబారీలో వున్నవాడు రాజే అనుకున్నారు, ప్రజలు. కాని, అక్కడ వున్నది రాజలాంఛనాలన్నీ ధరించి వున్న బోధిసత్వుడు. అలాగే తలారుల వశంలో బలిపీఠం మీద వున్న బోధిసత్వుడు, అతడి దుస్తులు ధరించి వున్న రాజు!

ఈ రహస్యం ఎరగని తలారులు, తమ అధీనంలో వున్న మనిషిని, రాజాజ్ఞ ప్రకారం తల నరికారు. ప్రాణం పోగానే దుర్మార్గుడైన కాశీరాజుకు, అతడి నిజ స్వరూపం వచ్చింది. అప్పుడు ఆ చంపబడినవాడు రాజు అని ప్రజలకందరికీ తెలిసిపోయింది. వెంటనే గొప్ప కలకలం రేగింది. ఈ విచిత్ర సంఘటనకు కారకులెవరా అని వాళ్ళు ఆశ్చర్యపడసాగారు.

అప్పుడు ఇంద్రుడు బోధిసత్వుడికీ, ప్రజలకూ కనిపించి, జరిగినదంతా చెప్పి, "ఈనాటి నుంచీ బోధిసత్వుడే మీ రాజు, సుజాత పట్టపురాణి!" అని అంతర్ధానమయ్యాడు.

పాపం పండి, దుర్మార్గుడైన రాజు బలిపీఠానికి ఆహుతి అయినందుకు రాజ్యంలోని ప్రజలందరూ సంతోషించారు. ఇంద్రుడు చెప్పినదాని ప్రకారం బోధిసత్వుణ్ణి రాజుగానూ, సుజాతను రాణిగానూ అంగీకరించారు.

ఆనాటి నుంచీ కాశీరాజ్యంలో ధర్మం నాలుగుపాదాల నడిచింది. నెలకు మూడు వర్షాలు కురుస్తూ దేశం సుభిక్షంగా వుంటూ వచ్చింది.





# రెండు నగరాల వినాశనం

ప్రసేనజిత్తు పరిపాలనాకాలంలో, కోసల ఒక బలమైన రాజ్యం. దాని రాజధాని శ్రావస్తి. కపిలవస్తుపాలకులైన శాక్యులకు, తాము ప్రసేనజిత్తుకన్న గొప్ప వంశస్థులమనే గర్వం వున్నదని, ఒక చారుడి ద్వారా ప్రసేనజిత్తుకు తెలిసింది.

తన సామంతులైన శాక్యులకు, తనపై యిలాంటి చులకనభావం వుండడం ప్రసేనజిత్తుకు బాధ కలిగించింది. ఆయన కపిలవస్తుకు వెళ్ళాడు. శాక్యులు ఆయనకు ఘనంగా స్వాగతం యిచ్చారు. ప్రసేనజిత్తు, తానొక శాక్య రాజకుమార్తెను వివాహమాడదలిచినట్టు చెప్పాడు. ఆయన ఉద్దేశం – ఈ వివాహం ద్వారా తన అంతస్తు పెంచుకుందామని.





శాక్యులు పెద్ద చిక్కులో పడ్డారు. వాళ్ళు, బలవంతుడైన ప్రసేనజిత్తు కోర్కెను తిరస్కరించడం ప్రమాదం అని గ్రహించి, రహస్యంగా తమలో తాము సంప్రతించుకుని, ఒక కన్యను ప్రసేనజిత్తుడికిచ్చి వివాహం జరిపారు.

ప్రసేనజిత్తు సంతోషంగా శ్రావస్తికి తిరిగివచ్చాడు. ఆ రాత్రి ఆయన పెళ్ళి కుమార్తె వెంట తెచ్చుకున్న బహుమతులను పరిశీలిస్తూండగా ఒక లేఖ కంటబడింది. అది రాసినది, పెళ్ళి కుమార్తెపై ద్వేషం గల ఒక శాక్య బాలిక. ప్రసేనజిత్తు వివాహమాడినది, ఒక శాక్యనాయకుడి దాసీపుత్రిక అని అందులో వున్నది.





ప్రసేనజిత్తు కోపావేశంతో భవనం పైఅంతస్తుకుపోయి, సైనికులను హెచ్చరించే పెద్ద గంట మోగించమన్నాడు. ఆ వెంటనే వేలకొద్దీ సైనికులు పరుగు, పరుగున వచ్చి, రాజాజ్ఞ కోసం భవన ప్రాంగణంలో నిలబడ్డారు.

కపిలవస్తుపై దాడి బయలుదేరే ముందు, తన వధువును ఒకసారి చూసి పోదామని ప్రసేనజిత్తు తన గదికి వచ్చాడు. అమాయకురాలైన ఆ బాలిక దుఃఖిస్తూండడం చూడగానే ఆయన మనసు మారింది. వెంటనే సైనికులను తిరిగి పొమ్మని ఆజ్ఞాపించి, ఆమె తన పట్టపు రాణి అని ప్రకటించాడు.






కొంతకాలం గడిచింది. రాణి ఒక మగ పిల్లవాణ్ణి కన్నది. పిల్లవాడు విరోధకుడు అన్న పేరుతో పెరిగి, పెద్దవాడై క్షత్రియోచిత విద్యలన్నిటా ఆరితేరాడు. ఒకసారి అతడు తన తాతగారిని చూసేందుకు కపిలవస్తు వెళ్ళాడు. అక్కడ భోజన సమయంలో శాక్యులెవరూ తన పంక్తిన కూర్చోక పోవడం అతడికి ఆశ్చర్యం కలిగించింది.

శాక్యుల యీ వింతప్రవర్తనకు కారణమేమిటి! శ్రావస్తికి తిరిగిరాగానే, విరోధకుడు సంగతి చెప్పి, తల్లిని ప్రశ్నించాడు. ఆమె దాచకుండా జరిగినదంతా చెప్పింది. విరోధకుడు ఉగ్రుడై పోయాడు.







అతడు, తండ్రి దగ్గిరకు పోయి, "శాక్యులు చేసిన యింత పెద్ద అవమానాన్ని నువ్వెలా సహించి వూరుకున్నావు?" అని తీవ్రస్వరంతో అడిగాడు. తన వృద్ధాప్యదశలో, కొడుకు తనపై తిరుగుబాటు చేయనున్నాడని గ్రహించి, ప్రసేనజిత్తు మగధరాణి అయిన తన కుమార్తె యింటికి వెళ్ళి, దిగులుతో మంచం పట్టి, త్వరలోనే మరణించాడు. విరోధకుడు రాజయాడు.

విరోధకుడు కపిలవస్తుపై యుద్ధానికి పోదలిచాడు. సేనానులు అందుకు యిది తరుణం కాదన్నారు. మంత్రులు కూడా అతడి తండ్రిని అవమానించిన శాక్యులు ఎవరూ బతికిలేరని చెప్పారు. అయినా విరోధకుడు కపిలవస్తుపై యుద్ధానికి వెళ్ళాడు.







శాక్యులు యుద్ధసన్నద్ధులై లేరు. ఆ కారణంగా విరోధకుడి సైన్యాలను ఎదిరించి నిలబడలేక పోయారు. విరోధకుడు కపిలవస్తు రాజభవనాలలో అమూల్య వస్తుసముదాయాన్ని దోచి, భవనాలను అగ్నికి అహుతి చేశాడు. అసంఖ్యాకులైన శాక్యులు చంపబడ్డారు. నగరం ధ్వంసం చేయబడింది. విరోధకుడు తన రాజధాని అయిన శ్రావస్తికి తిరుగు ప్రయాణమయాడు.

అతడు తిరిగివచ్చే సరికి, రాజభవనం కాలి నేలమట్టమై వున్నది. మగధరాజు తన మామగారైన ప్రసేనజిత్తును, విరోధకుడు కష్టాలపాలు చేశాడన్న కోపంతో శ్రావస్తిపై దాడి చేసి, దాన్ని ఆక్రమించాడు. శ్రావస్తి, మగధరాజ్యంలో కలిపివేయబడింది.





# ఉద్యోగం విలువ

రంగరాజుకు తల్లిదండ్రులు చిన్నప్పుడే పోయారు. ఒక్కగా నొక్క తమ్ముడు రామరాజుకు ఆ లోటు తెలియకుండా ఎంతో ప్రేమగా పెంచాడు. తను ఎలాగో కష్టపడి చదివి, తమ్ముణ్ణి కూడా చదివించాడు. రంగరాజుకు త్వరలోనే దివాణంలో మంచి ఉద్యోగం దొరికింది. అప్పటికింకా రామరాజు చదువుకుంటున్నాడు. రంగరాజుకు దివాణంలోని మరొక ఉద్యోగి, తనకూతురునిచ్చి పెళ్లి చేశాడు.

మరికొన్నాళ్ళకు రామరాజు చదువు పూర్తయింది.

రంగరాజు తనకు తెలిసిన వాళ్ళ ద్వారా, అతడికీ దివాణంలో ఒక చిన్న ఉద్యోగం యిప్పించాడు. అయితే, మూడో నాటికే రామరాజు ఆ ఉద్యోగం కాస్తా వదులుకుని వచ్చేశాడు.

రంగరాజు ఆశ్చర్యపడి, "ఎందుకు వదిలేశావు? మీ యజమాని ఏమైనా అన్నాడా?" అని అడిగాడు.

రామరాజు చిరాకుపడుతూ, "ఆ యజమానికి బొత్తిగా మర్యాద తెలీదు. నాకు యిచ్చిన ఉద్యోగం ఒకటి, చేయించుకునే పనులు మరొకటిగా వున్నాయి. నేనా ఉద్యోగం చెయ్యను," అన్నాడు.

రంగరాజు అప్పటికి సరే అని వూరుకుని, తరవాత తమ్ముడికి మరొకచోట ఉద్యోగం వేయించాడు. రామరాజు దీని క్కూడా మూడోనాటికి ఉద్వాసనచెప్పేశాడు.

ఈ సారి గట్టిగా కోపగించుకున్న అన్నతో రామరాజు, "నా పైఅధికారి ప్రతి చిన్నదానికీ నన్ను బాధపెట్టేస్తున్నాడు. అస్తమానం తీసేస్తాను అంటూ బెదిరిస్తున్నాడు. నువ్వు ఉద్యోగం తీసేసేదేమిటని, నేనే మానేశాను," అన్నాడు.

బొమ్మిడి అచ్చారావు



'' ప్రతి ఉద్యోగానికీ, యిలా ఏవేవో కారణాలు చెప్పి మానేస్తుంటే, నీ కోసం ఎక్కడని ఉద్యోగాలు చూసేది? ఈ సారి ఉద్యోగంలో ఎన్ని సాధక బాధకాలున్నా మానేసి రాకు. కష్టంగా వుంటే, నా కొచ్చి చెప్పు. ఆ సమస్య లేవో నేను పరిష్కరిస్తాను.'' అని గట్టిగా హెచ్చరించాడు రంగరాజు.

రామరాజు అన్న చెప్పినదంతా మౌనంగా విన్నాడు.

ఒక వారం తరవాత రంగరాజు తమ్ముణ్ణి వెంటపెట్టుకుని దివాణానికి వెళ్ళాడు. అతడు తమ్ముడి కోసం సంపాయించిన ఉద్యోగంలో దగ్గిరుండి చేర్పించి చెప్పవలసిన జాగ్రతలు మరోసారి చెప్పి, వచ్చేశాడు.

నాలుగు రోజులు గడిచాక రామరాజు అన్నతో, ''ఈ ఉద్యోగం అసలే చెయ్యలేను. నన్ను మరీ పసిపిల్లవాడి కింద కట్టి మాట్లాడేస్తున్నారు, పై అధికారులు. నేచేసే పని వాళ్ళకేమాత్రం తృప్తికరంగా లేదు,'' అన్నాడు.

రంగరాజు పెల్లుబికే కోపాన్ని ఆపుకుంటూ, ''అయితే, ఉద్యోగం వదిలేసి వచ్చావా ?'' అని అడిగాడు.

''ఇంకా లేదు. వదిలేసే ముందు నీకు చెప్పమన్నావు కదా,'' అన్నాడు రామరాజు.

''సరే, ఇంతకూ ఏం చెయ్యాలనుకుంటున్నావు ?'' అన్నాడు రంగరాజు.

''మాటలు పడుతూ, ఉద్యోగంలో వుండి, నా ఆత్మాభిమానం చంపుకోలేను,'' అన్నాడు రామరాజు.

''అలా అయితే, నీ యిష్టంవచ్చినట్టు చేసుకో,'' అని రంగరాజు వూరుకున్నాడు.

ఇది జరిగిన నాలుగురోజుల తరవాత రంగరాజు విచారంగా ముఖం పెట్టుకుని యిల్లు చేరాడు.

''ఏమయింది ? అలావున్నావేం ?'' అంటూ భార్యా, తమ్ముడూ రంగరాజును ఆత్రంగా అడిగారు.

"నా ఉద్యోగం పోయింది," అన్నాడు రంగరాజు.

"అదేమిటి? ఏంతో కాలంగా చేస్తున్నావుగా?" అంటూ రామరాజు ఆశ్చర్యపోయాడు.

"అందువల్లే మరింత విచారంగా వున్నది. మరొక ఉద్యోగం ఎక్కడా దొరికేలాలేదు," అన్నాడు రంగరాజు.

క్రమంగా కుటుంబానికి ఆర్థిక యిబ్బందులు ప్రారంభమయాయి. రోజులు గడవడం కష్టమైపోతున్నది. తిండికి ముఖం వాచే పరిస్థితి ఎదురైంది. రామరాజు బుద్ధెరిగి పస్తులుండి ఎరగడు. రంగరాజు యిన్నాళ్ళుగా తమ్ముడికి ఏలోటూ రానివ్వలేదు.

రామరాజు తనకు దొరికిన ఉద్యోగాలను చేజేతులా వదులుకున్నందుకు విచారించసాగాడు. తనకైనా ఉద్యోగం వుంటే, కుటుంబం యిలాంటి యిక్కట్లలో పడేది కాదు. ఇప్పుడు తను చెయ్యాలనుకున్నా ఉద్యోగం యిచ్చే నాథుడు లేడు. ఇంతకాలంగా అన్న అండ చూసుకునే, తనకు దివాణంలో వచ్చిన ఉద్యోగాల పట్ల ఏహ్యభావం కనబరిచాడు! ఇప్పుడు కూలిపనులకు వెళ్ళయినాసరే, కుటుంబ పోషణకు ఏదోకొంత సంపాయించాలి.

రామరాజు తన నిర్ణయం గురించి చెప్పగానే, తమ్ముడిలో వచ్చిన మార్పుకు సంతోషించి రంగరాజు, "దివాణంలో నువు



వదిలి వచ్చిన ఉద్యోగం యింకా ఖాళీగానే వుందేమో, ముందు ఒకసారి పోయి విచారించిరా," అన్నాడు.

రామరాజు కళ్ళనీళ్ళ పర్యంతమై పోతూ, "ఆ నాడు పైవాళ్ళతో గొడవలు పడి మానుకున్న ఉద్యోగాన్ని యింకా నా కోసం అలాగే అట్టే పెడతారా? ఏ అదృష్టవంతుడికో యిచ్చేసి వుంటారు," అన్నాడు.

"అయినా, తెలుసుకోవడం మంచిది గదా?" అని రంగరాజు తమ్ముణ్ణి దివాణానికి పంపాడు.

ఆ ఉద్యోగం యింకా ఖాళీగానే వున్నది. పై అధికారి ముందు కోపగించుకున్నా, రామరాజు కాళ్ళా వేళ్ళా పడటంతో, అతన్ని తిరిగి పనిలో చేర్చుకోవడానికి అంగీకరించాడు. రామరాజుకు జీవితంలో మొదటిసారిగా ఉద్యోగానికున్న విలువ తెలిసివచ్చింది. అతడు తనకు ఉద్యోగం దొరికిందన్న వార్త, అన్నకు మహా సంతోషంగా చెప్పాడు.

మర్నాడు అన్నకూడా మంచి దుస్తులు వేసుకుని దివాణానికి బయలుదేరడం చూసి రంగరాజు, "నీకూ్కడా మళ్లీ ఉద్యోగం దొరికిందా ఏం?" అని అడిగాడు ఆశ్చర్యపోతూ.

రంగరాజు నవ్వి, "నా ఉద్యోగం అసలు పోవడం అంటూ జరగలేదు. నాకు చేసే ఉద్యోగం మీద గౌరవంతో పాటు, శ్రద్ధాసక్తులు కూడా వున్నాయి. అలాటప్పుడు నన్నెందుకు తీసేస్తారు? నీకు నువు చేసే పనిమీద చిన్నచూపు, నిర్లక్ష్యం ఏర్పడ్డాయి. అందుకే చేరిన ప్రతి ఉద్యోగానికేదో ఒక వంక పెట్టి వదులుకుంటూ వచ్చావు. నిన్నటి వరకూ మనం ఇంట్లో అనుభవించిన గడ్డు పరిస్థితులు, నేను కావాలని కల్పించినవే! నీ పై అధికారికి ముందే చెప్పి, నీ ఉద్యోగం మరొకరికి పోకుండా ఏర్పాటు చేశాను," అన్నాడు.

రామరాజు తాను యింతకాలంగా చేసిన అవివేకపు పనులకు చాలా సిగ్గుపడ్డాడు.



# నిజాయితీ

అవంతీ రాజ్యమంత్రి అమరపాలుడు నీతినిజాయితీలకు పెట్టింది పేరు. ఒకనాడు పొరుగు రాజ్యంలో వుంటున్న అయన మేనల్లుడు భూపాలుడనే వాడు, మేనమామ యింటికి వచ్చి, మాటల సందర్భంలో, "మామయ్యా, మీ అవంతీరాజ్య సైనికుల సంఖ్య నిజంగా ఎంత?" అని అడిగాడు.

ఇది చాలా గోప్యమైన సంగతి కాబట్టి అమరపాలుడు వెంటనే జవాబు చెప్పక, ఒక క్షణం ఆలోచించి, "ఒరే బాబూ! ఇలాంటి ముఖ్యమైన రహస్యం చెప్పాలంటే నువ్వు, నా నుంచి విన్న దాన్ని మరెక్కడా చెప్పనని ప్రమాణం చేయాలి," అన్నాడు.

తన నిజాయితీని మేనమామ శంకిస్తున్నాడని భూపాలుడు కోపం తెచ్చుకుని, "మామయ్యా! వేదశాస్త్రాలు చదివి, యజ్ఞయాగాలు చేసిన నిప్పులాంటి వంశంలో పుట్టిన నేను, మాటతప్పి రహస్యం బయట పెడితే, ఇహపరలోకాల్లో అధోగతి పాలవుతాను." అంటూ ప్రమాణం చేశాడు.

అమరపాలుడు వెంటనే, "ప్రమాణం సంగతి ఎత్తగానే, నీ తండ్రి వంశం గొప్పతనాన్ని గురించీ, దాని వారసుడివైన నీ నిజాయితీ గురించీ చెప్పావు, బాగానే వుంది. నేనూ, రాజుగారి రహస్యాలు తెలుసుకోవడానికి ముందు నా నిజాయితీ శంకించ వద్దని, యిలాగే ప్రమాణం చేశాను," అన్నాడు.

భూపాలుడు వెంటనే తన తప్పు తెలుసుకున్నాడు.

—ఎమ్. డి. సౌజన్య





# కోపిష్ఠి మొగుడు

కూతురూ, అల్లుడూ ప్రయాణమవుతుండగా, లక్ష్మమ్మ మరోసారి అల్లుడు వీరేశంతో, ''మీ దారిలోనే శ్రీనివాసుడి ఆలయం. దర్శనం చేసుకుని వెళ్ళడం మాత్రం మర్చిపోకండి, బాబూ!'' అన్నది.

భర్త పోయాక లక్ష్మమ్మ పల్లెలో వుండి వ్యవసాయం చూసుకుంటున్నది. వసంత ఆమెకు ఒక్కగా నొక్క కూతురు. పట్నంలో ఉద్యోగం చేసే వీరేశంతో, ఆమె పెళ్లి నాలుగు రోజుల క్రితమే జరిగింది. భార్యా, భర్తలను దర్శనానికి పంపిస్తానని లక్ష్మమ్మ, పెళ్లికి ముందే మొక్కుకుని వున్నది.

వీరేశం, వసంతా శ్రీనివాసుడి ఆలయం చేరేసరికి చీకటి పడింది. వాళ్ళకు అతి కష్టం మీద సత్రంలో వుండడానికి గది దొరికింది.

''ముసలిది తిని కూర్చోలేక మొక్కు మొక్కింది. గది దొరక్కపోయి వుంటే, మన పాట్లు ఎలా వుండేవో, ఊహించడమే కష్టం,'' అన్నాడు వీరేశం కోపంగా.

వసంత నివ్వెరపోయింది. భర్త, తన తల్లిని ఉద్దేశించి అంత అమర్యాదగా మాట్లాడటం ఆమెకు బాధకలిగించింది. నిద్ర పట్టేదాకా వీరేశం అత్తగారిని తిట్టిపోస్తూనేవున్నాడు. వసంత అడ్డుకోబోతే, ''నువు నోరు మూసుకుని పడుకో!'' అంటూ గట్టిగా కసురుకున్నాడు.

మర్నాడు దర్శనానికి వెళ్ళే ముందు ఫలహారం తెప్పించాడు, వీరేశం.

''దర్శనం అయ్యాక తిందాం,'' అన్నది వసంత.

''నువ్వు నోరుముయ్యి. నా ముందు అసలు మాట్లాడవద్దు. నేను ఎలా చెబితే, అలా చేయడం, నీ పని. అర్థమైందా?''

మాచిరాజు కామేశ్వరరావు

అని ఆమె మీద విరుచుకు పడ్డాడు, వీరేశం.

వసంత గుడ్లనీరు కుక్కుకుని, ఇష్టం లేకుండానే బలవంతాన ఫలహారం తిన్నది. ఆ క్షణంలోనే ఆమెకు భర్త కోపిష్ఠివాడని అర్థమైంది.

ఇద్దరూ గుడికిపోయి దర్శనం చేసుకుని వచ్చారు.

వసంత సామాను సర్దుతూ, "గుడి చాలా బావుంది. విగ్రహంలో జీవకళ వుందికదూ ?" అన్నది భర్తతో.

"నా ముందు వాగ వద్దని ముందే చెప్పాను. నేను చెప్పింది వినడం, నోరు మూసుకుని పడి వుండడం, నీ పని! తెలిసిందా?" అన్నాడు వీరేశం పెద్దగా ఉగ్రుడైపోయి.

వసంత మనస్సు చివుక్కుమన్నది. వాళ్ళు ఆ సాయంత్రానికి పట్నం చేరారు. వసంతకు కొత్తకాపరం నరకప్రాయంగా వుంది. ఆమె ఇంటెడు చాకిరీ చేయాలి, భర్తకు అన్నీ అమర్చాలి; అయితే నోరు మెదపకూడదు. యిలా పదిహేనురోజులు గడిచాయి.

ఆ రోజు సాయంత్రం ఎవరో తలుపు తట్టగా, వెళ్ళి తలుపు తెరిచింది, వసంత. గుమ్మంలో ఒక ఏభైఏళ్ళ ముసలాయన నిలబడి వున్నాడు.



"మా వీరేశం యిల్లు, యిదేకదూ!" అంటూ ముసలాయన చొరవగా లోపలికి వచ్చి కూర్చున్నాడు.

వసంత బిడియపడుతూ చూస్తున్నంతలో, "నేను, నీకు పినమామగారి నవుతాను. ఫర్వాలేదు, ఆ కుర్చీలో కూర్చో." అన్నాడు ముసలాయన.

వసంత కుర్చీలో కూర్చోగానే, "మీ అత్తగారు, మామగారు ఎక్కడున్నారిప్పుడు ?" అని అడిగాడు ముసలాయన చుట్టూ కలయచూస్తూ.

"వాళ్ళు పదేళ్ళక్రితమే పోయారు గదండీ!" అన్నది వసంత, ముసలాయన కేసి ఆశ్చర్యంగా చూస్తూ.



"అవునుకదూ. మర్చేపోయాను! వాళ్ళు పోయినట్లు నమ్మబుద్ధి కావడం లేదు. ఇద్దరూ పేరుకు తగ్గట్టు సీతా రాముల్లా వుండేవాళ్ళు!" అన్నాడు ముసలాయన కళ్ళు తుడుచుకుంటూ.

"వాళ్ళ పేర్లు పార్వతి, శివయ్య కదండీ!" అన్నది వసంత అనుమాన పడుతూ,

"అవున్లే, ఆ భగవంతుడి పేర్లే! శివయ్య తమ్ముళ్ళు, ఎక్కడవున్నా రిప్పుడు ?" అంటూ ముసలాయన వాళ్ళ పేర్లూ అవీ తెలుసుకున్నాడు.

వసంత ముసలాయన్ని గురించి మరింతగా అనుమాన పడిపోతూనే అన్నీ వివరంగా చెప్పింది. చీకటిపడి వీరేశం వచ్చాడు.

"ఈయన మీకు దూరపు వరస బాబాయి అవుతారట!" అంటూ యింకా ఏదో చెప్పబోయింది, వసంత.

"నాకు, నోరుంది. అడిగి తెలుసుకో గలను. నువ్వు, నోరు మూసుకుని లోప లికి పో," అంటూ కసురుకున్నాడు, వీరేశం.

వసంత మారు మాట్లాడకుండా లోపలికి వెళ్ళిపోయింది.

"ఏరా, వీరేశం, నేను గుర్తున్నానా?" అంటూ అప్యాయంగా పలకరించాడు, ముసలాయన.

ఆయన గుర్తురాకపోయినా, తన తల్లి తండ్రుల గురించీ, బాబాయిలను గురించీ అన్ని విషయాలూ చెపుతూండడంతో, ముసలాయన తమకు కావలసినవాడే అనిపించింది వీరేశానికి.

అతను లోపలికి వచ్చి వసంతతో, "మా బాబాయికి మర్యాద ఏమైనా చేశావా లేదా? మీ మామా, పినమామగార్లకి ఆయనంటే ప్రాణం, తెలుసా?" అన్నాడు.

వాళ్ళ పేర్లన్నీ ముసలాయనకు తానే చెప్పిన విషయం, భర్తకు చెప్పాలని చూసింది, వసంత. అయితే వీరేశం

ఆమెను ఏమీ చెప్పనీయక, "ముందు నోటికి తాళం వేసుకుని, వంటపని మొదలు పెట్టు," అంటూ గట్టిగా గదమాయించాడు.

వాళ్ళిద్దరూ కబుర్లు చెప్పుకుంటూ వుంటే వసంత వంటపని పూర్తిచేసి, ఇద్దరికీ వడ్డించింది. ఆ తర్వాత వాళ్ళకు మధ్య గదిలోనే పడకలు ఏర్పాటు చేసి, తను వంటగదిలో చాప పరుచుకుని పడుకున్నది.

తెల్లవారవస్తూండగా భర్త కేకలకు ఆమెకు మెలకువ వచ్చింది. చప్పున లేచి భర్తవున్న గదిలోకి వెళ్లింది. ముసలాయన పడక ఖాళీగా వున్నది. పక్కనే వున్న పెట్టె తెరచివున్నది. బట్టలు గది నిండా చిందరవందరగా పడివున్నాయి.

"ఈ వచ్చిన ముసలాడు పచ్చి దొంగ వెధవ! రాత్రి మంచిమాటలతో నమ్మించి ఇంట్లో చేరి, తెచ్చిన జీతం డబ్బు మొత్తం ఎత్తుకుపోయాడు," అన్నాడు వీరేశం బాధగా.

వసంతకు మొదటినుంచి ముసలాయన మీద అనుమానంగానే వున్నది. ఆమె ఆ సంగతి భర్తకు చెప్పి, "వాడు, మీ వాళ్ళ వివరాలన్నీ నా నుంచే తెలుసుకుని, వాళ్లందరూ తనవాళ్లన్నట్టుగా మీకుచెప్పి, బుట్టలో వేశాడు," అన్నది.



"మరి యీ సంగతంతా ముందే నాకెందుకు చెప్పలేదు?" అంటూ వీరేశం కళ్ళెర్రచేశాడు.

"ఇలాంటి ఒళ్ళు తెలియని కోపం వల్లనే! అసలు ఎప్పుడైనా మీ ముందు నా నోరు విప్పనిచ్చారా? ఒళ్ళుతెలియని మీ కోపమే, జరిగిన యింత అనర్థానికీ కారణం," అన్నది ధైర్యం తెచ్చుకుని, వసంత.

వీరేశానికి తన తప్పు తెలిసివచ్చింది. ఎవరికోపం వారి పాలిటి శాపం!

"డబ్బు పోతే పోయింది. ఈ అనుభవంతో బుద్ధివచ్చింది," అని మనసులోనే అనుకున్నాడు, వీరేశం.

ఆ రోజు నుంచీ భర్తలో వచ్చిన మార్పుకు వసంత చాలా సంతోషించింది. నాలుగు రోజుల తరవాత ఒక కుర్రవాడు సంచి ఒకటి తెచ్చి వీరేశానికి యిస్తూ, "ఎవరో ముసలాయన యీ సంచీ మీకివ్వమన్నాడు," అని చెప్పి వెళ్ళిపోయాడు.

వీరేశం ఆ సంచి మూతివిప్పి చూసి, ఆశ్చర్యపోయాడు. అందులో డబ్బున్నది. దానితో పాటు ఒక ఉత్తరం కూడా వున్నది:

"నాయనా, వీరేశం! మీ భార్యాభర్తలు, నన్ను దొంగ అనుకుని తిట్టుకుని వుంటారు. అయితే, యీ అనుభవంతో నీలో మార్పు వచ్చి వుంటుందని నమ్ముతున్నాను. కోపిష్ఠి మొగుడితో వేగడం చాలా కష్టం. నేను ఒకప్పుడు కోపిష్ఠివాడినే! నా భార్యను నోరెత్తనీయకుండా చీటికీ మాటికీ చీదరించుకుంటూ రోజులు గడిపాను. నా భార్య మెత్తని మనిషి కాబట్టి, నా కోపాన్ని భరించి కాపరం చేసింది. జీవితం చాలా చిన్నది; కోపంతో దాన్ని దుఃఖమయం చేసుకోకూడదు! భార్య పోయాక, నాకు దురవస్థ పట్టింది. నా కోపానికి భయపడి ఇద్దరు కొడుకులూ, కోడళ్లూ నన్ను తమ ఇంట చేరనివ్వలేదు. ఆ రోజు సత్రంలో మీ పక్క గదిలోనే వున్న నేను, మీ సంభాషణ అంతా విన్నాను. నువ్వు నిజంగా మారి వుంటే, వసంతను తీసుకుని మా ఇంటికిరా. కొడుకులకు దూరంగావున్న నాకు, నువ్వు కొడుకులాంటివాడివి! నా చిరునామా యిది—"

ఉత్తరం అంతా చదివి వీరేశం ఉత్సాహంగా, "వసంతా, త్వరగా బయలుదేరు," అన్నాడు.

వసంత తల ఆడించి వూరుకున్నది.

"నువు నోరెత్తగానే, నోరుమూసుకో అని కోప్పడే దురలవాటు నాలో ఎప్పుడో పోయింది. ప్రయాణం ఎక్కడికని అడగవేం? మీ మామగారింటికి, పద, పద," అంటూ హడావిడి చేశాడు, వీరేశం.





# సమయస్ఫూర్తి

వజ్రగిరి రాజ్యంలో ఒక గజదొంగ వుండే వాడు. అతడి దగ్గిర ధర్మయ్య, బ్రహ్మయ్య అనే శిష్యులుండేవాళ్ళు. వృద్ధాప్యంలో గజదొంగ చనిపోతూ, శిష్యులిద్దరినీ దగ్గిరకు పిలిచి, "ఒరే, మీరిద్దరూ కలిసి కట్టుగా వృత్తి చేసుకుంటూ సుఖంగా బతకండి. ఆ విధంగా నాలుక్కాలాల పాటు నా పేరు నిలిపిన వాళ్ళవుతారు," అని చెప్పాడు.

గురువు పోయాక కొద్ది రోజులపాటు ధర్మయ్యా, బ్రహ్మయ్యా కలిసే వున్నారు. కాని, ఆ తరవాత భాగాల దగ్గిర పేచీలు పడి, విడిపోయారు.

ఈ యిద్దరిలో ధర్మయ్య తెలివైన దొంగ. అతడేనాడూ రాజభటులకు పట్టుబడలేదు.

బ్రహ్మయ్య మాత్రం చాలాసార్లు దొంగతనం చేస్తూ చిక్కిపోయి, దెబ్బలతో పాటు ఖైదు శిక్ష అనుభవించడం కూడా జరిగింది.

ఒకనాడు బ్రహ్మయ్య ఖైదు నుంచి విడుదలవుతూనే, ధర్మయ్యను కలుసుకుని, "అన్నా, నువ్వు రాజభటులకు ఏనాడూ పట్టుబడకుండా అంత తెలివిగా దొంగతనాలు చేయడంలో గల రహస్యం ఏమిటి? మనం యిద్దరం గొప్ప పేరు మోసిన ఒకే గురువుకు శిష్యులం గదా? ఆ మాటకొస్తే, గురువుగారి దగ్గిర నేను చేరాక రెండు, మూడేళ్ళ తరవాత గాని, నువ్వు శిష్యరికానికి రాలేదు," అన్నాడు.

ఆ మాటలకు ధర్మయ్య నవ్వి, "ఇందులో పెద్ద రహస్యం ఏమీ లేదు. సమయస్ఫూర్తి! అంతే," అన్నాడు.

"సమయస్ఫూర్తి అంటే ఏమిటి? కాస్త వివరంగా చెప్పు," అని అడిగాడు బ్రహ్మయ్య.

పఠాన్ మహబూబ్ ఖాన్

"గురువుగారి సేవ చేస్తూ, మనం ఆయన నేర్పిన విద్యలన్నీ సమానంగానే నేర్చుకున్నాం. కాని, నువ్వెంత విద్య నేర్చినా రాణించకపోవడానికి కారణం, నీలో సమయస్ఫూర్తి లేకపోవడం. నిన్న రాత్రి నే నొక రైతు ఇంట దొంగతనానికి వెళ్ళాను. చీకట్లో నా కాలు తగిలి, ఏదో వస్తువు కిందపడి శబ్దమైంది. వెంటనే రైతు భార్య మేలుకుని, 'ఎవరది?' అంటూ కేక పెట్టింది. నేను, వెంటనే పిల్లిలా మ్యావ్ అన్నాను. భర్త తన నిద్ర చెడగొట్టి నందుకు భార్యను కోప్పడుతూ, 'తెలియ డంలా, ఏదో పిల్లి, యికనిద్రపో,' అన్నాడు. నేను తీరిగ్గా అందిన వస్తువులు చేజిక్కించుకుని బయటపడ్డాను," అన్నాడు ధర్మయ్య.

"ఇదా, సమయస్ఫూర్తి అంటే? ఇంత స్వల్పవిషయం గురించి, నే నింత కాలంగా ఆలోచించకపోవడం ఆశ్చర్యం గానే వున్నది. మళ్ళీ వీలయినప్పుడు వచ్చి కనబడతాను. అవతల కాస్త అవసరం అయిన పని—వస్తా, వస్తా!" అంటూ బ్రహ్మయ్య బయలుదేరాడు.

ఆ రాత్రి వాడు ఒక ఇంటికి కన్నం వేసి, లోపలికి పోయాడు. ఎక్కడ ఏ విలువగల వస్తువు వున్నదా అని వెతుకుతున్నంతలో, కాలికి డబ్బాలాంటిదేదో తగిలి పెద్దగా శబ్దమైంది.

వెంటనే ఇంటావిడ కళ్ళుతెరిచి, భర్తను నిద్రలేపుతూ, "ఎవరదీ ?" అన్నది.

బ్రహ్మయ్య వున్నచోటునే నక్కి కూర్చుంటూ, "పిల్లిని!" అన్నాడు.

ఆ వెంటనే భార్యాభర్తలిద్దరూ, "దొంగ, దొంగ!" అంటూ కేకలు పెట్టారు.

ధర్మయ్య చెప్పిన సమయస్ఫూర్తి ఎందుకు బెడిసికొట్టిందో అర్థంకాని బ్రహ్మయ్య, తాను వేసిన కన్నంలోంచి గబగబా వీధిలోకి వచ్చాడు. కాని, అప్పటికే ఇంటి వాళ్ళకేకలు విన్న, ఇరుగు పొరుగు వాళ్ళు బయిటికి వచ్చి, వీధి వెంట పారిపోజూస్తున్న బ్రహ్మయ్యను పట్టుకుని, రాజభటులకు అప్పగించారు.





# విఘ్నేశ్వరుడు

"విఘ్నేశ్వరా! ఇప్పుడు నీవు చేసిన గజాసుర నిర్మూలన జ్ఞాపకంగా గణపతి నవరాత్రి ఉత్సవాలు కలకాలం ఘనంగా జరుగుతూంటాయి. ముందు కాలంలో ప్రజల స్వేచ్ఛ, శ్రేయస్సుల కోసం సాగే ఉద్యమాలు గణేశఉత్సవాలతో జయప్రదంగా కొనసాగి ఫలిస్తాయి. ఉత్సవాలన్నిటికీ గణపతి నవరాత్రి ఉత్సవం తిలకంగా ఉంటుంది!" అని ఆకాశవాణి పలికింది.

విష్ణువు విఘ్నేశ్వరుడితో, "పార్వతీనందనా! మేనల్లుడివని చెప్పి నాకు మరొక పని కూడా కల్పించావా!" అన్నాడు.

విఘ్నేశ్వరుడు, "మేనమామ వరస పెట్టి కాలనేమి అయిన కంసుణ్ణి మేనమామ గండాన నువ్వేలాగూ పుట్టి, చంపుతావుగదా! ఇలాంటి వరసలన్నీ నీవు నేర్పిన విద్యలేగదా నీరజాక్ష!" అన్నాడు.

విష్ణువు, "విఘ్నవినాశకా! నీ పరశువు ముందు, నా చక్రాయుధం ఏపాటి? నీ గొడ్డలిసాము చూసినప్పుడు మహ ముచ్చటేసింది సుమా!" అన్నాడు.

"పరశురామావతారంలో నా గొడ్డలి ఎరువు తీసుకెళ్ళి గర్వపోతులైన క్షత్రియుల్ని తెగనరుకుదువు గానిలే!" అన్నాడు విఘ్నేశ్వరుడు.

విష్ణువు, "గజవిఘ్నాసురుడి మీద ఎక్కి మర్దిస్తున్నప్పుడు నీ బుడిబుడి నడకల గుజ్జురూపం కూడా నన్నెంతో మురిపించిందోయి!" అన్నాడు.

**6.** కుమారస్వామి జననం



"అలాగైతే, వామనుడివై బలిచక్ర
వర్తిని పాతాళానికి అణగదొక్కదువు
గానిలే!" అని విఘ్నేశ్వరుడు అన్నాడు.

"నీ బుద్ధి విశేషం కూడా నన్ను అమి
తంగా ఆకర్షించుతోంది, ఏం చెయ్యను,"
అని విష్ణువు అనగా, విఘ్నేశ్వరుడు,
"ఏ యుగానికి అవసరమైన ధర్మాన్ని
ఆ యుగంలో స్థాపించడమే గదా, నీ
అవతారాలకు మూలకారణం! ధర్మసంస్థా
పనకు, అసలు అర్థం, సంఘం హింసతో,
మూఢాచారాలతో కుళ్ళిపోతున్న రోజుల్లో
బుద్ధుడవై మానవులకు సక్రమ సంఘజీవ
నాన్ని, నిర్వాణాన్ని బోధించుతావులే!
మాయాదేవి స్వప్నంలో నా తెల్లని ఏనుగు
రూపం గర్భంలో ప్రవేశించి బుద్ధుడైన
సిద్ధార్థుడి అవతారానికి నాంది పలుకు
తుంది!" అని చెప్పాడు.

విష్ణువు మహదానందం పొందాడు.

పరమాణురూపంలో ఉన్న విఘ్నం,
"విఘ్నరాజా, నీ బానిసను, నీ ఆజ్ఞాను
వర్తిని, వెళుతున్నాను," అని శలవు
తీసుకొని కాళింది మడుగు చేరి కాళీయు
డుగా దాక్కుంది.

విఘ్నం వెనకనే మూషికాసురుడు
మూషికరూపంతో వచ్చి ప్రచ్ఛన్నంగా
దాగి, విఘ్నానికి పట్టిన గతి చూసి పట
పట పళ్ళు కొరికి, నిజరూపంతో బోర
విరుచుకొని విఘ్నేశ్వరుడి ముందు
నిలబడి సింహనాదం చేశాడు.

విఘ్నేశ్వరుడు బలిష్ఠమైన అతని
శరీరాన్ని సంతృప్తిగా చూశాడు. మూషికా
సురుడు నిర్లక్ష్యంగా విషపునవ్వు నవ్వుతూ,
"విఘ్నం నీ బానిస కనుక ఏం చేసినా
చేశావు గాని, నేను నీ జన్మవిరోధిని.
సింహస్వప్నం అనే మాట వినే ఉంటావు,
సింహాన్నై నీ కుంభస్థలాన్ని చీలుస్తాను!"
అని అంటూ సింహంగా మారి పెద్దగా
గర్జించాడు.

విఘ్నేశ్వరుడు, "సింహమా! నువ్వు
జగజ్జనని వాహనానివి, నిన్ను గౌరవిస్తు
న్నాను!" అన్నాడు.

సింహం మళ్ళీ గర్జించి ఉరకబో తూంటే, విఘ్నేశుడు, "శివా, శరభా!" అని స్మరించాడు.

సింహానికి ఎదురుగా శివుని శరభావతారం ఘీంకార గర్జనలు చేస్తూ నిలిచింది. శరభానికి సింహశరీరము, కేసరాలు, కోరలు ఉంటూ ఏనుగు తొండమూ, దంతాలు ఉన్నాయి. మహా సర్పంలాంటి తోక చివర జ్వాలలు కక్కే మకర ముఖము ఉంది. శరభం జూలు అగ్నిశిఖల్లాగా ఎగురుతున్నాయి. శరభం తొండంతో సింహం ముఖం వాచేలా కొట్టింది. సింహం తోకముడిచి పరుగు తీసింది. శరభావతారం మాయమైంది.



విఘ్నేశ్వరుడు తొండాన్ని యోజనం పొడవున సాగదీసి సింహం నడుము చుట్టి పట్టి ఎత్తాడు. సింహం కిరకిర లాడింది. ఆ సమయంలో ఆకాశగమనం చేస్తున్న నారదుడు 'సా' అని గొంతు సాగదీస్తూ, "సామజ వరవదనా!" అంటూ హిందోళ రాగాన్ని ఆలాపించాడు.

దేవతలు గుమిగూడి ఆకాశం నుండి వింత చూస్తున్నారు. విష్ణువు, "విజయ విఘ్నేశ్వరా! నువ్వు పట్టిన సింహాన్ని పెంచుకుంటాను, యివ్వవూ?" అన్నాడు.

విఘ్నేశ్వరుడు నవ్వి, "పెంచినట్టే పెంచి తలా, గోళ్ళూ తీసుకొని నరసింహావతారం ఎత్తి హిరణ్యకశ్యపుణ్ణి చీలుద్దామనా? అదేం కుదరదు. ఈ మృగరాజు అవసరం నాకు ఉంది, నీ నరసింహావతారం నీవు చూసుకోవలసిందే!" అన్నాడు.

తొండం మూషికాసుర సింహాన్ని తిన్నగా తీసుకెళ్ళి మహాశ్వేత ముందు విడిచి అదృశ్యమైంది. మహాశ్వేత భర్తకు హితవు చెప్పినా వినకుండా నిజరూపంతో విఘ్నేశ్వరుడితో ఢీకొనడానికి పరుగు తీశాడు. మహాశ్వేత దేవిని ప్రార్థించింది. దేవి కనిపించి, "నీ భర్త విఘ్నేశ్వరుడికి ఎలుక వాహనంగా చిరంజీవిగా ఉంటాడు. అలా రాసిపెట్టి వుంది. నీవు కూడా శ్వేత



ఛత్రానివై నీ భర్తతోబాటు కలకాలం విఘ్నేశ్వరుణ్ణి సేవిస్తూ ఉంటావు!'' అని చెప్పి అంతర్ధానమైంది.

వజ్రదంతుడు కామరూపి గనుక, ఈసారి ఏనుగుల్ని తన్నుకుపోగల గండ భేరుండపక్షి రూపంతో, దారిలో కనిపించిన రెండు ఏనుగుల్ని గోళ్ళతో పట్టుకుని ఎగిరి వెళ్తూండగా చెలరేగిన అలజడికి, చిన్న గ్రద్దరూపంతో ఒక చెట్టుమీద హరిని ధ్యానిస్తూ ఉన్న గరుత్మంతుడికి ధ్యాన భంగమైంది. కోపంతో గ్రద్ద గండ భేరుండాన్ని ముక్కుతో పొడిచింది. ఆ పోటుకు వజ్రదంతుడు నిజరూపంతో నేలకూలాడు.

గరుత్మంతుడు, ''ఇంతకంటె రుచికరమైన ములుకుపోట్లు తినబోతున్నావు. వెళ్ళు!'' అంటూ ఎగిరిపోయాడు.

మూషికాసురుడు వెళ్ళి విఘ్నేశ్వరుడితో, ''నీకూ ఉన్నాయి, పెద్దదంతాలు, వెలక్కాయలు నొక్కి తినడానికి తప్ప మరెందుకూ పనికిరావు. నా దంష్ట్రలతో వజ్రాల్ని పిండి చేస్తాను, కైలాసాన్ని గుల్ల చేస్తాను, తెలుసునా!'' అన్నాడు.

వినాయకుడు దిక్కులు చూస్తూ, తనలో తాను గొణుక్కుంటూన్నట్టుగా, ''ఔనౌను, ఎందుకూ కొరగాని దంతాలు ఉండి ఎందుకూ?'' అంటూ ఒక దంతాన్ని పటుక్కున సగానికి విరిచి, పారేసినట్టుగా విసరేశాడు.

ఆ దంతం గాలిలో గిర్రున తిరుగుతూ ఇంద్రజాలం ప్రదర్శించి వెళ్ళి వజ్రదంతుణ్ణి గుచ్చిగుచ్చి పొడవడం ప్రారంభించింది. రక్తం ధారలుకట్టి కారసాగింది. మహాశ్వేత అది చూడలేక మూర్ఛపోయింది. వజ్రదంతుడు చిన్న ఎలుకగా మారి తుర్రున పారిపోయి రాళ్ళమధ్య కలుగు చేసుకొని దూరాడు. ఒక దంతాన్ని విరుచుకొని విఘ్నేశ్వరుడు ఏకదంతుడు అనిపించుకున్నాడు.

దంతం కూడా కలుగులో దూరి ఎలుకను అలా పొడుస్తూనే వెంబడించింది.

తోకవెంట రక్తం జాడ కడుతుంటే ఎలుక సారంగం దొల్చుకుంటూ పాతాళానికీ, పాతాళం నుంచి భూమ్మీదకూ వచ్చి పరుగులు తీసి లోకమంతా చుట్టి చివరకు విఘ్నేశ్వరుడి శరణుజొచ్చి, ''నా కా చావు రాదు. నీ దంతం గుచ్చిగుచ్చి చంపుతున్నది, బాధ తప్పించు దేవా!'' అని వేడుకున్న మూషికాసురుడికి విఘ్నేశ్వరుడు అభయం యిచ్చాడు. దంతం వచ్చి అతని హస్తం అలంకరించింది.

విఘ్నేశ్వరుడు, ''మూషికా! చూట్టానికి చిట్టెలుకవే గాని మహాబలుడివి. మహా కూర్మావతారంతో మంథరపర్వతాన్ని, ఆది వరాహావతారంతో భూమిని ఎత్తిన విష్ణువు కంటె బలశాలివి! తగిన వాహనం కుదరక నేను నా లంబోదరంతో నడవలేక అవస్త పడుతున్నాను. నీ లాంటి....'' అంటూ చెప్పడానికి సందేహిస్తున్నట్టు నసిగాడు.

విఘ్నేశ్వరుడి పొగడ్తకు మూషికాసురుడు పొంగిపోయి, ''స్వామీ! నీ దంతం నా లోని అజ్ఞానాన్ని పారదోలి గుచ్చి గుచ్చి జ్ఞానాన్ని నింపింది. నీకు వాహనం కావడం నా భాగ్యంగా భావిస్తున్నాను,'' అంటూ ఏనుగంత ఎలుకగా పెరిగాడు.

విఘ్నేశ్వరుడు దానిపై కాలు మోపి కూర్చోబోగా మహా మూషికం కీచుకీచుమంటూ అణుక్కుపోయింది.



విఘ్నేశ్వరుడు, ''నాయనా మూషికా, నీవు చిట్టెలుకగా ఉంటేనే నన్ను సునాయాసంగా మోయగలవు. నా ఆకారానికి చిట్టెలుక వాహనమే అన్ని విధాలా అమరుతుంది,'' అన్నాడు.

మూషికాసురుడు యథాప్రకారంగా చిట్టెలుకగా తగ్గిపోయాడు. విఘ్నేశ్వరుణ్ణి ఎక్కించుకొని చకచకా చుట్టూరా తిరుగుతూ, ''ఔను స్వామీ! ఇప్పుడు నిన్ను మోస్తున్నట్టే లేదు!'' అన్నాడు.

మూర్ఛనుండి తేరుకొన్న ధవళ విఘ్నేశ్వరుడికి నమస్కరించి, ''దేవా! నా భర్త నీకు చిట్టెలుక వాహనంగా ఉంటాడు, నేనుకూడా నీకు శ్వేతఛత్రమై



ఉంటాను, ఈ వరం అనుగ్రహించు,'' అన్నది.

విఘ్నేశ్వరుడు, ''అమ్మా! నీ తెల్లని గొడుగు చల్లనినీడ నాకు రక్ష! నా భాగ్యం కొద్ది దొరికింది," అంటూ ఎలుకను చూసి, ''వజ్రదంతా, దేవి అనుగ్రహం పొందిన సాధ్వి ధవళ మాటకు తిరుగులేదు. నా వాహనంగా ఉండు, నాతో బాటే నాకు పెట్టేవన్నీ, నువ్వూ తిను! అందరూ మొట్టి కాయలు పెట్టుకొని, మూడు గుంజీలు తీసి లెంపలేసుకుంటూంటే, తృప్తిగా ఉంటుంది. నా ముందు, నీ ముందు కూడా అలాగే అంతా చేస్తూంటారు!'' అన్నాడు.

''ఔను దేవా! నేనూ అలాగే కోరదామనుకున్నాను. నేను వజ్రదంతుడిగా నా ముందర దేవతలచేత అలాగే చేయిస్తూండేవాణ్ణి. నీ వాహనాన్నై కృతార్థుడినైయ్యాను!'' అని మూషికుడు అన్నాడు.

ధవళ తెల్లని గొడుగుగా విఘ్నేశ్వరుడిపై నిలిచింది. ఆ దంపతులు చిరంజీవులై వినాయకుణ్ణి అలాగే సేవిస్తూ ఉంటారు. విఘ్నేశ్వరుడు మూషిక వాహను డయ్యాడు.

విష్ణువు, విఘ్నేశ్వరుడితో, ''ఏకదంతా! మూషికోత్తమ వాహనా! నీ వాహనం చూస్తే నాకు అసూయగా ఉందోయి. ఎంత మంచి వాహనాన్ని సంపాదించావు!!,'' అన్నాడు.

విఘ్నేశ్వరుడు, ''నీ కల్కి అవతారంలో నా వాహనం నీకు తెల్లని గుర్రమై అంతరిక్షాన్ని దాటి గ్రహాంతరాలకు తీసుకెళ్తుందిలే! మానవులకు కొత్త వలస రాజ్యాలను సమకూర్చు!'' అన్నాడు.

విష్ణువు, ''ఆహాహా! నీ నోటి చలవ వల్ల అలాగే జరగాలి!'' అని ఆనందించాడు.

నారదుడు, ''విజయవిఘ్నేశ్వరా! ఇప్పటికి నీతోబాటే విష్ణువు తొమ్మిది అవతారాలు తెలిశాయి, ఒక్కటి మిగిలింది!'' అన్నాడు.

విష్ణువు నారదుణ్ణి చూసి కన్ను గీటి, ''త్వరలోనే ఆ కళ్యాణ ఘడియ వచ్చి

నప్పుడు అదీ తెలుస్తుందిలే! తొంద రెందుకు," అన్నాడు.

"ఎవరి కళ్యాణం దేవా ?" అని అడిగాడు నారదుడు.

"మన కళ్యాణ చక్రవర్తి విజయ విఘ్నేశ్వరుడిదే!" అన్నాడు విష్ణువు.

విఘ్నేశ్వరుడు చిరుకోపంగా చూశాడు. "వెయ్యి విఘ్నాలు కల్పించుకోక తప్పదు!" అని గట్టిగా అనుకున్నాడు.

"నాయన్నాయన, అంతటితో సరి పెట్టు! వెయ్యి విఘ్నాలు పూర్తి అయ్యాక అరవిఘ్నం అయినా కల్పించుకోడానికి చెల్లేదిలేదు సుమీ!" అని విష్ణువు హెచ్చరించాడు.

నారదుడు, "వెయ్యి విఘ్నాలనగా ఏ మాత్రం? వెయ్యి విఘ్నాల తర్వాత విఘ్నేశ్వరుడి పెళ్లి తప్పదు-తప్పదు!" సరిసరి మాగరి అని పాడుతూ ముల్లో కాలు తిరిగాడు.

శివుడికి పార్వతిపైగల మోహానురాగం తేజస్సుగా మారింది. అగ్నిదేవుడు దాన్ని తీసుకెళ్ళి శరవణ సరస్సు చేరేలాగ చేశాడు. ఆరు ముఖాలతో కుమారస్వామి అవతరించాడు. ఆరుగురు ఋషి భార్యలు అతణ్ణి పెంచి పార్వతీ పరమేశ్వరులకు అప్పగించారు. కుమారస్వామి పెరిగి పెద్దవాడైయ్యాడు. గరుత్మంతుడు అతనికి నెమలి వాహనం యిచ్చాడు. ఇంద్రుడు అతనికి ఎన్నో ఆయుధాల్ని ఇచ్చాడు. పార్వతి శక్తిబల్లాన్ని ఇచ్చింది. కుమారస్వామి పెరిగి పెద్ద అవుతూంటే తారకాసురుడు తల్లడిల్లిపోతూ భయంతో పీడకలలు కనసాగాడు.

కుమారస్వామి గొప్ప తపస్సు చేసి బ్రహ్మజ్ఞానాన్ని విడమర్చి చెప్పి సుబ్రహ్మణ్యస్వామి అనిపించుకున్నాడు. ఓంకారం గురించిన నిగూఢ రహస్యాల్ని శివుడంతటి, వాడికే గురువై ఉపదేశించాడు. అన్నదమ్ములైన విఘ్నేశ్వరుడు, కుమారస్వామి కైలాసంలో పార్వతీ శివుల కనుల పండుగగా ఎంతో సఖ్యంగా ఆట పాటలతో విహరిస్తున్నారు.






# 6

దిలైలా, జీనాబ్‌ల మోసాలు జరిగిన కొద్దికాలానికి కైరో నగరం నుంచి, ''పాదరసం'' అనే సార్థకనామం గల యువకుడొకడు బగ్దాద్ నగరానికి చేరుకున్నాడు. ఇతని అసలు పేరు అలీ. చాలా అందగాడు కాని గజదొంగ. ఇతని స్వస్థలం కైరో. ప్రస్తుతం కొత్వాలుగా ఉంటున్న అహ్మద్ కైరోనగరంలో పేరు మోసిన దొంగగా ఉండినప్పుడు ''పాదరసం'' అతని వద్దనే చోరవిద్య నేర్చుకున్నాడు. అహ్మద్ బగ్దాద్‌కు వచ్చి, అక్కడ కూడా దొంగగా కీర్తి సంపాదించుకుని కొత్వాలు పదవి సంపాదించిన కాలంలో కైరోలో ఈ ''పాదరసం'' దొంగల నాయకుడుగా ఉంటూ వచ్చాడు. అతను ఎన్నోసార్లు రక్షక భటులకు పట్టుబడి కూడా తప్పించుకు పోవటంచేత అతన్ని ప్రజలు, ''పాదరసం' అని పిలవసాగారు.

''పాదరసం'' అలీని, అహ్మదే బగ్దాద్‌కు పిలిపించాడు. దిలైలా విషయంలో పరాభవం తిన్ననాటినుంచీ అహ్మద్‌కు ప్రతిక్షణమూ ''పాదరసం'' జ్ఞాపకం రాసాగాడు. వాడు తనకు కుడి భుజం లాటి వాడు. వాడే తన పక్కన వుంటే తనకీ పరాభవం జరిగేదికాదనుకున్నాడు అహ్మద్. అదీగాక ఇప్పుడు అహ్మద్, దిలైలా మీద స్వయంగా పగ తీర్చుకోవటానికి లేదు. ఇప్పుడామెకు తనకున్నంత హోదా వున్నది. కనుక, ఇందుకు పాదరసమే సరి అయిన వాడు.

''పాదరసం'' అలీ బగ్దాద్ నగరం చేరి నేరుగా అహ్మద్ యింటికి వెళ్ళాడు. అహ్మద్‌కు అతన్ని చూడగానే ప్రాణం



లేచివచ్చింది. "తమ్ముడూ, నా యింట కొంతకాలం రహస్యంగా ఉన్నట్టయితే నీతో ఒక పని ఉంది. ఆ పని అయినాక నిన్ను బహిరంగందా ఖలీఫా దగ్గిరికి తీసుకుపోయి శిఫార్సు చేసి మంచి ఉద్యోగం ఇప్పిస్తాను," అన్నాడు అహ్మద్ పాదరసంతో.

పాదరసం, అహ్మద్ ఇంట రెండు రోజులు గడిపాడు. ఆ తరవాత అతనికి ఇల్లు ఖైదు లాగా తోచింది. మూడోనాడు అహ్మద్ దివాణానికి వెళ్ళిపోగానే, "పాదరసం" ఇంటి నుంచి బయటికి జారుకున్నాడు. అతని ఉద్దేశం బగ్దాద్ నగరం నాలుగు మూలలూ తిరిగి చూసి వద్దామని.

అతను కొద్దిదూరం వెళ్లాడో లేదో అతనికి మగ దుస్తులు ధరించి, నెత్తిన వెండి పావురం గల బంగారు టోపీ పెట్టుకుని గుర్రం మీద పోతూ ఒక ముసలిదీ, ఆమె వెంట ఎర్రజలతారు దుస్తులు ధరించిన నలభైమంది నీగ్రోలూ కనిపించారు. వారెవరో కాదు, దిలైలా, ఆమె నౌకర్లూనూ. దిలైలా ఆ ఉదయం దివాణానికి వెళ్ళి టపా చేయవలసిన వార్తలు పోగుచేసుకుని తన ఇంటికి తిరిగిపోతున్నది.

దిలైలా, "పాదరసం" అలీ కొత్త ముఖం చూసి అతని అందానికి ఆశ్చర్య పడింది. కాని ఆమె కళ్లకు అతని ముఖంలో తన శత్రువైన అహ్మద్ కవళికలు కొన్ని కనిపించాయి.

నిజానికి అహ్మద్ శిష్యత్వం చేయటంలో అలీ అతని చూపూ, ముఖభంగిమలూ తెలియకుండానే అలవరచుకున్నాడు. అలీ, అహ్మద్ ఇంటి వైపునుంచే వస్తూండటం కూడా దిలైలా పసికట్టింది.

ఆమె యింటికి పోతూనే తన కుమార్తె జీనాబ్‌కు తాను చూసిన యువకుణ్ణి వర్ణించి చెప్పి, "అహ్మద్, ఈ యువకుణ్ణి పిలిపించాడని తోస్తున్నది. వాడు వీథులు వింతగా పరీక్షించటం చూస్తే యివాళో, నిన్ననో వచ్చాడనిపిస్తున్నది. మనం చాలా జాగ్రత్త మీద ఉండాలి!" అన్నది.

జీనాబ్ తల్లి చెప్పినదంతా విని, కొంచెం సేపు ఆలోచించి, ''ఏమిటమ్మా ? హేమా హేమీలను లక్ష్యపెట్టని దానివి గడ్డాలూ, మీసాలూ సరిగారాని ఈ కుర్రాడికి దడుస్తా వేమిటి ?'' అన్నది. ఆమె అందమైన దుస్తులు వేసుకుని, కళ్లకు కోనగా కాటుక దిద్ది, మేలిముసుగు వేసుకుని, చేత సంచీ పట్టుకుని, నడిచే మెరుపు తీగెలాగా వీథిలోకి వెళ్ళింది.

ఆమె మెల్లిగా నడుచుకుంటూ కొంత దూరం వెళ్ళాక ఒక దుకాణం దగ్గిర ''పాదరసం'' కనిపించాడు. తల్లి చెప్పిన వర్ణనను బట్టి అతన్ని గుర్తుపట్టి జీనాబ్ అతన్ని తోసుకుంటూ వెళ్లి వెనక్కు తిరిగి, ''కళ్ళులేని కబోది !'' అన్నది కోపంగా.

''పాదరసం'' ఆమెను చూసి ఆమె అందానికి ఎంతగానో ఆశ్చర్యపోయాడు. అతను నవ్వుతూ, ''ఆహా, ఎంత అందం ! ఎవరిదానివి ?'' అన్నాడు.

''నే నొక వర్తకుడి కుమార్తెను, ఇంకో వర్తకుడి భార్యను. మీ ధోరణి చూస్తే ఈ వూరికి కొత్తలాగుంది, మీ బస ఎక్కడ ?'' అని అడిగింది జీనాబ్.

అహ్మద్ విషయం రహస్యంగా ఉంచాలనే ఉద్దేశంతో పాదరసం, ''ఇంకా బస లేదు. ఎక్కడన్నా చూడాలి,'' అన్నాడు.

''అయితే మా యింటికి రండి. మాది చాలా పెద్ద ఇల్లు. నా భర్త దుకాణానికి పోతే ఇంటి దగ్గిర నాకు తోడెవ్వరూ ఉండరు,'' అన్నది జీనాబ్.





ఆమె వెంట వెళ్ళటం క్షేమం కాదేమోనని "పాదరసం" శంకించాడు. కాని తనను ఈ నగరంలో ఎవరూ ఎరగరు గనకనూ, ఈ పిల్ల తనకు శత్రువై ఉండే అవకాశం ఏమీ కనిపించలేదు గనకనూ ఆమె వెంట వెళ్ళి ఆమె ఎటువంటిదో తెలుసుకోవాలని అతను నిశ్చయించుకున్నాడు.

జీనాబ్ అతన్ని వీథులు తిప్పి ఒక పెద్ద యింటి ముందుకు తీసుకొచ్చి, తాళపు చెవి కోసం సంచీలో వెతకనారంభించింది. ఆ ఇల్లు ఒక గొప్ప వర్తకుడిది. ప్రస్తుతం ఇంట ఎవరూ లేరు. వర్తకుడు ఉదయమే ఇల్లు తాళం వేసుకుని దుకాణానికి వెళ్ళిపోయి, రాత్రిదాకా తిరిగి రాడు. ఆ సంగతి జీనాబ్‌కు తెలుసు.

"అయ్యో, తాళం చెవి కాస్తా ఎక్కడో పడిపోయింది. ఇప్పుడు ఏం చెయ్యాలి? మీరేమైనా తాళం తీయగలరా?" అని జీనాబ్ పాదరసాన్ని అడిగింది.

"చూస్తాను," అంటూ పాదరసం అంత పెద్ద కప్పతాళాన్నీ ఇట్టె తీసేశాడు. అతను నిజంగా సమర్థుడైన దొంగేనని జీనాబ్‌కు రూఢి అయిపోయింది.

ఇద్దరూ లోపలికి వెళ్ళారు. "మీరు హాలులో కూచోండి. నేను బావిలో నీళ్ళు చేది వంట చేస్తాను," అంటూ జీనాబ్ బిందె తీసుకుని దొడ్లోకి వెళ్ళింది.

కాస్సేపటికి బావి వద్ద నుంచి జీనాబ్ కెవ్వున కేక పెట్టింది. ఏం జరిగిందోనని పాదరసం పరుగెత్తుకుంటూ అక్కడికి వెళ్ళేసరికి ఆమె బావిలోకి చేదవేసి లోపలికి తొంగి చూస్తూ కనపడింది.

"ఏం జరిగింది?" అని అడిగాడు పాదరసం ఆదుర్దాగా.

"నా రవ్వల ఉంగరం! అయిదు వందల దీనారాలు పోసి నిన్ననే నా భర్త కొన్నాడు. వదులుగా ఉందని అప్పుడే చెప్పాను. అది కాస్తా బావిలో పడిపోయింది. నా భర్తకు తెలిస్తే చంపేస్తాడు!" అని జీనాబ్ విలవిలలాడింది.

"నీకేం భయం వద్దు! నేను దిగి తీస్తాను." అంటూ పాదరసం అడ్డు దూలానికి మోకు కట్టి దాని సహాయంతో బావిలోకి దిగాడు. అతను మోకు వదిలి నీళ్లలో మునగగానే జీనాబ్ మోకు పైకి లాగేసి, "నిన్ను అహ్మద్ పైకి తీస్తాడులే! అందాకా అందులోనే ఉండు!" అంటూ అతని దుస్తులతో సహా ఇంటికి వెళ్లింది.

ఆ రాత్రి ఆ ఇల్లుగల వర్తకుడు పొద్దుపోయి తన నౌకరుతో సహా ఇంటికి తిరిగి వచ్చి తలవాకిలి తలుపులు దగ్గిరిగా వేసి ఉండటం చూసి ఆశ్చర్యపోయాడు. ఇల్లంతా చూసిన మీదట దొంగతనం మటుకు జరగలేదని తెలిపోయింది.

వర్తకుడి స్నానానికి నీటి కోసం సేవకుడు బావి వద్దకు పోయి బావిలో చేద వేసి నీరు తోడబోయాడు. కాని చేద విపరీతమైన బరువనిపించింది. "బాబయ్యా, దయ్యం!" అంటూ సేవకుడు గాబరాగా పరిగెత్తాడు. వర్తకుడు దీపం తీసుకుని దొడ్లోకి వెళ్ళేసరికి చేదతాడు పట్టుకుని బావిలో నుంచి ఎక్కి వస్తూ పాదరసం కనిపించాడు.

"బద్మాష్! ఎవరు నువు? నా బావిలో నీకేం పని? చెప్పు! ఇప్పుడే నిన్ను భటులకు వప్పగిస్తాను!" అంటూ వర్తకుడు అరిచాడు.

"అయ్యా, ఇది ఏ దేశం? ఏ గ్రామం? నేను ఈజిప్టు దేశస్థుణ్ణి. మా నైల్ నదిలో స్నానం చేస్తూండగా ఒక సుడిగుండం నన్ను దిగలాగింది. నేను ఎంత లోతుకు పోయానో నాకే తెలీదు. మళ్ళీ నీటిపైకి తేలేసరికి మీ బావిలో ఉన్నాను!" అని పాదరసం అలీ అమాయికంగా బొంకాడు.

వర్తకుడీ బొంకు నమ్మాడు.

"నాయనా! నీ అనుభవం చాలా చిత్రంగా వుంది. ఇది బగ్దాద్ నగరం. చాలా దూరం వచ్చావు. నీకు పాడిబట్టలిస్తాను కట్టుకో. ఈ రాత్రికిక్కడే భోంచేసి పడుకో, రేపు ప్రయాణమై మీ నగరానికి వెళుదువు గాని!" అన్నాడాయన.

—(ఇంకా వుంది)



## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 25 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1981 ఆగస్టు నెల సంచికలో ప్రకటింపబడును.







A. L. Syed　　　　K. Vasanthavalli

★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకు సంబంధం ఉండాలి.)

★ జూన్ నెల 20-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంతమాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రూ. 25/-లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, (వ్యాఖ్యలకు సంబంధించని ఇతర విషయాలేవీ చేర్చరాదు.) ఈ అడ్రసుకు పంపాలి :-చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26.

---

## ఏప్రిల్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : నీళ్ళుంటే ఆట మాకు

రెండవ ఫోటో : కాళ్ళుంటే చాలు నాకు

పంపిన వారు : వి. లీలాకిష్ణప్రసాద్, పొన్నూరు. (గుంటూరు జిల్లా)

బహుమతి మొత్తం రు. 25/-ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) 188, Arcot Road, Madras-600 026 (India). Controlling Editor: NAGI REDDI.




ప్రత్యేక బహుమతి 25 పై తగ్గింపు

# ఇదిగో!
# పెప్పర్‌మెంట్ రుచి కలిగిన ఒక చాక్‌లెట్ బిస్కట్

స్క్రంచ్

## కరకర తినే చక్కని తినుబండారం

భారతదేశంలో ఈ రకం రెండు రుచుల తియ్యని తినుబండారం ఇదే మొదటిసారి—చాక్‌లెట్ మరియు మింట్ కలసినది, మృదువయినది, రుచికరమైనది, ఎక్కువ చాక్‌లెట్ క్రీమ్‌తో వున్నది—గోధుమవన్నె గల కరకరలాడే రెండు అందమైన బిస్కట్ల మధ్యవున్న పెప్పర్‌మెంట్ రుచిగల చాక్‌లెట్. ఇటువంటి దానిని మీరు యింతవరకు ఎప్పుడు రుచి చూడలేదు. ఇప్పుడే ఒక్క ప్యాకెట్ బిస్కట్ తీసుకోండి. కరకర నములుతూ తినండి, స్క్రంచ్...స్క్రంచ్...స్క్రంచ్...





స్క్రంచ్ కరకర తినే చక్కని తినుబండారం

ట్రూ బిస్కట్లు తయారుచేసేవారు అందచేస్తున్న సరిక్రొత్త తినుబండారం

HTM-AFL-2345







## మేమందరం గోల్డ్‌స్పాటర్స్

# వారెవ్వా! వహ్వా!
# ఇదేమరి గోల్డ్‌స్పాటింగ్ రోజు!



ఇదొక క్రొత్త మాట కాదు సుమండీ!
ఉత్సాహంతో పొంగులు వారే ఆనందాలచిందులకీ,
మజాగా హుషారైన భావాలకు
ఇదొక అనుభవం మరి. ఆనందం, మజా,
తమాషాలు మూడూ కల్పిన ముచ్చటైన
మురిపపు మాటే...గోల్డ్‌స్పాటింగ్.




గోల్డ్‌స్పాటింగ్‌తో వహ్వా...మజా యే మజా!

TRIKAYA-GS-4-80-TEL

CHANDAMAMA (Telugu) JUNE 1981 Regd. No. M. 4854
everset/80/PP/333 tl




# పిల్లలు ముద్దు ముద్దుగా నవ్వుతూ మురిపిస్తారు




వారికి ప్రీతితో యివ్వండి

## పార్లే గ్లూకో– మజా రుచితో ఎంతో శక్తితో

పాలు, గోధుమలు, పంచదార, గ్లూకోజ్ మజా రుచులతో నిండి పుష్టినిచ్చే లక్షణాలుగలది.



వరల్డ్ సెలక్షన్ బహుమతిని గెలుచుకున్నది

పార్లే గ్లూకో భారత దేశంలో అత్యధికంగా అమ్మబడే బిస్కట్